# గ్రామఫోనుపాటలు

## 1000 కంప్లీటు సాంగ్సు

ఇందు

నూతన కామిక్కు పాటలు చేర్చబడినవి.


వలవల శ్రీరాములు,

బుక్సెల్లర్ అండ్ పబ్లిషర్,

రాజమండ్రి.

# గ్రామఫోనుపాటలు

## 1000 కంప్లీటు సాంగ్సు.

రైతుపాట, కుండపాట, కూలీలపాట, జంపర్ జాకెట్టుపాట, చెల్లమ్మపాట,
చెన్నపరెడ్డిపాట, ఇన్నరుసెడ్డీపాట, కాఫీకిడబ్బులులేవుపాట,
నెరానెరాబండిపాట, తాపీమేస్త్రీపాట, జట్కాబండిపాట, బ్రహ్మ
చారిపాట, వుయ్యాలపాట, తెళ్ళరాళ్ళకమ్మలజోడుపాట,
గాజులపాట, తెలుకులజిడ్డుపాట, భారతమాతపాట, పూలోపూలో
పాట, రవికపాట, కప్పతాళాలుపాట, తీర్థంజంగాలుపాట,
తుందిగాళ్ళపాట, జాగరతెటోలెంకిపాట, సోకుగాడేపాట, చెరుకు
తోటపాట, యర్రియ్యబావపాట, పోలీసెంకటస్వామిపాట,
నాయుడోరింటికాడపాట, సారాపాట, చాకలిపాట, ఈత
పళ్ళపాట, కంసాలెంకయ్యపాట, వివాహభోజనంబు
పాట, కోలాటంపాట, వప్పగింతలపాట, నా
కొందుకీకాపురంబు పాట, కొయ్యోడి
పాట, సన్నతుంచెలపాట,
యింకను అనేకమైన నూతన కామిక్కుపాటలు
యిందుచేర్చబడినవి.

వలవల శ్రీరాములు,
బుక్సెల్లర్ అండ్ పబ్లిషర్,
రాజమండ్రి.

## పాటకుల పేర్లు.

1 కీ॥ శే॥ కపిలవాయి రామనాథశాస్త్రి

2 మిస్. రామతిలకం

3 కె. రఘురామయ్య

4 నిడుముక్కల సుబ్బారావు

5 చొప్పల్లి సూర్యనారాయణభాగవతార్

6 చిత్తూరు నాగయ్య

7 స్థానం నరసింహారావు

8 కుంపట్లసుబ్బారావు

9 కొచ్చర్లకోట సత్యనారాయణ

10 ఎం. అబ్రహాం

11 అద్దంకి శ్రీరామమూర్తిగారు

12 కొచ్చెర్లకోట రంగారావు

13 కీ॥ శే॥ జొన్నవిత్తుల శేషగిరిరావు

14 టి. పి. కైలాసం

15 సి. యెస్. ఆర్. ఆంజనేయులు

16 వల్లూరి జగన్నాథరావు

17 వేమూరి గగ్గయ్య

18 దైతా గోపాలం

19 నిట్టలవెంకటేశ్వర్లు అండ్ బి. వెంకట్రావు

20 బ్రహ్మజోశ్యుల సుబ్బారావు

21 డాక్టర్ సి, హెచ్. బి. వెంకటాచలం

22 రెంటచింతల సత్యనారాయణ

23 బలిజేపల్లి లక్ష్మీకాంతకవి

24 బందా కనకలింగేశ్వరరావు

25 పులిపాటి వెంకటేశ్వర్లు
26 పారుపల్లి సత్యనారాయణ
27 ఆరణి సత్యనారాయణ
28 మాష్టర్ రాజేశ్వరరావు
29 పారుపల్లి సుబ్బారావు
30 తుంగల చలపతిరావు
31 మద్దూరి బుచ్చన్నశాస్త్రి
32 వి. విశ్వనాథం
33 ఆర్. వెంకటా్రామయ్య
34 ఈమని వెంకటా్రామయ్య
35 మిస్. సురభి కమలాభాయి
36 వి. వి. సుబ్బారావు
37 జెల్లంకొండ సుబ్బారావు
38 జె. శ్రీరామమూర్తిభాగవతులు
39 కీ॥ శే॥ దొమ్మేటి సూర్యనారాయణ
40 మిస్. కాంచనమాల
41 మిస్. పుష్పవల్లి
42 మిస్. భానుమతి
43 మిస్. శ్రీరంజని
44 మిస్. కోటిరత్నం
45 మిస్. శాంతకుమారి
46 మిస్. కె. రాజ్యం
47 మిస్. కన్నాంబ

యింకను అనేకమైన నూతనకాముక్కపాటలున్ను, సినీమాప్లేగపాటలున్ను, ప్రస్తుతము వాడుకలోనున్న పాటలున్ను చేర్చబడినవి.

శుభమస్తు.

# గ్రామఫోను పాటలు.

## పాటలు — పద్యములు.

### రంగమార్తాండ కపిలవాయి రామనాథశాస్త్రి అండ్ మిస్. రామ తిలకం, బెజవాడ.

పరబ్రహ్మ పరమేశ్వర పురుషోత్తమ సదానంద ॥ప॥ పరంజ్యోతి పరాత్పర పతిత[illegible]న స్వప్రకాశ వరదాయక సకలలోక వందిత సుఖదాప్రమేయ పాహిపాహి మాంపాహి ॥ప॥

### కె. రఘురామయ్యగారు, బెజవాడ.

భాగేశ్వరి.

గోకులపావనజనా కృష్ణా ఆఆఆ ॥గో॥ భువనపాలన పరమనిధానా, గోపికాంతా, గోకులకృష్ణా ॥గో॥

భాగేశ్వరి.

దేవదేవ సకలదనుజ సంహారణా ఆఆఆ ॥దే॥ దీనజనపరిత విదారణా ఆఆఆఆ ॥దే॥ సుకుమార సుశరీర జితమన్మథాకార, కామకోటి జితమార కరుణరాదాయయో ॥దే॥

### తాపీమేస్త్రీపాట.

అలాటిలా టూడదాన్ని కాను మేస్త్రీ అద్దరూపాయి డుబ్బులకు రాను మేస్త్రీ పనికి రాను మేస్త్రీ కూలికి రాను మేస్త్రీ నేను రాను మేస్త్రీ

||అలా|| గొప్పగొప్పోళ్లంతా నాతో చేయి ముకుంటారు ఖద్దు వద్దనేదాక పనిచేసేదాన్ని నేను ||అలాటిలా||

వ|| అయితే పిల్లా,

పొద్దుపోయిందాక బద్దకము పడకుండ యిద్దరము కలసి మెలసి పని చేసుకుందామె మనము పనిచేసుకుందామె||

అలాటిలాటాడదాన్ని కాను మేస్త్రీ అద్దురూపాయి డుబ్బులకు రాను మేస్త్రీ పనికి రాను మేస్త్రీ కూలికి రాను మేస్త్రీ నాను రాను మేస్త్రీ||

## కామిక్.

సాంబశివా సత్యవచనము సాగనివ్వరు లోకులు సత్యవంతుని మాట నమ్మరు లోకులు పలుకానులు, ఒకరితో మాట్లాడకుంటె వీడెంతగర్వితుడందురు మరిఒకనితో మాట్లాడితే వీడకురుపాటోడందురు అధికవస్త్రము నల్లనైతే వీడెంత మోటుకుడందురు మరి అధికవస్త్రము తెల్ల[illegible]తే వీడొన్నికాడనుకొందురు దానధర్మము చేయకుంటే వీడెంతలోభి అందురు అధిక ధర్మము చేసితే సన్యాసివాడనుకొందురు|| చారెడు పిడికెడు తింటె పిట్టమేలోడందురు అడ్డెడు మానెడుతింటె తిండిపోతోడందురు స్త్రీలకొరక లధికమైతే జారకాంతు డనుకొందురు మానముధరియించితే మొగతనం లేదందురు|| డబ్బుగల్గి యింటిలోనుంటె వీడేధీమంతుడందురు - డబ్బు లేకను మొగంవాల్చితే వీడెంత బీదకుడందురు ||సాం|| వళ్ళుఅలసియూ కష్టపడితె వీడెంతసాహసుడందురు - వొళ్ళుసుఖము చూచితిరిగితె వీడెంత సోమరుడందురు ||సాం|| వాసిగా ఏలూరుపురమున కొత్తపేట నివాసులూ చేసెరాట్కావి పంజరపు జోగులు ||సాం||

## నిడుముక్కల సుబ్బారావుగారు, బెజవాడ.

### కల్యాణి__ఆది.

ఎవ్వారికి తరంబౌను జగదీశు మాయలను, వర్ణించుటకు నిలా ||ఎవ్వ|| చివ్వలు గలిగించు స్నేహంబు పొసగించు, నవ్వించుదుఃఖాబ్ధి నానాగతుల

నిల ॥ఎ॥ ఆతనిసంకల్ప మాత్రమున నీజగము లన్నియు బుట్టొందుటల్ మరి యునారీతిని వికల్పవంబున, నాశనమగు, చైతన్యస్వరూపుడైనా మాగోపా లుని వర్ణించుటకు నిల ॥ఎ॥

పద్యం — మోహన.

సీ. తనయునిబాసె యుత్తానపాదుండు । జనకునిక్షుద్బాధ వినుటచేత పుత్రశోకార్తుడై మడిసె పంక్తిరథుండు । జనకునిక్షుద్బాధ వినుటచేత దశ కంధరుడు సంతతులతో నశించె । జనితుని క్షుద్బాధ వినుటచేత । కొడుకునే రుక్మాంగదుడు చంపపోవడె । జనకుని క్షుద్బాధ వినుటచేత

గీ. స్త్రీల దుర్బోధనలు చెవిజేర్చుకతన ! ఈజగతి నెంతవారు నశిం తురిగాన । సులభగతి ప్రళయాంతకంబు సలుపజాలు । వెలదిబోధనలకు చెవి యొగ్గవలదు వలదు.

చొప్పల్లి సూర్యనారాయణభాగవతార్ గారు, విజయనగరం.

కమాచ్.

రామజోగి మందుకొని ప్రేమతో భుజియింపరాదున్న । కామక్రోధ లోభమోహ ఘనమైన రోగాలకిమందు రామజోగి మందుకొనరే ఓజనులారా ॥రా॥ కాటుకకొండాలవంటి కర్మము లెడబాపేమందు । సాటిలేని జగము లందు సామిరామజోగిమందు ॥రా॥ వాదూకుజెప్పినగాని వారిపాపములగొను ముదముతోనె ! మోక్షమిచ్చె ముద్దురామజోగిమందూ ॥రా॥

కామవర్ధని.

రామయతండ్రి ఓరామయతండ్రి । నానోములెల్లపండినాయి రామ యతండ్రి । మునులుబాబులడవిగలరు రామయతండ్రి । ఆకి మొక్కి దీవె నలగొనుము రామయతండ్రి । రాకాసిమూకలు రామయతండ్రీ నీకు చీకాకు చేస్తారు రామయతండ్రి । వదలకుండ చెంతనుండు లక్ష్మణబాబు నీవదినె నన్నగాయాల లక్ష్మణబాబు । మెల్లమెల్లగెల్లువమ్మ సీతమ్మతల్లి నీవు ముల్లు ముట్రిజూడకొంచు సీతమ్మతల్లి । ఎల్లినాడవెల్తువుగాని రామయతండ్రి బేగి చల్లగిల్లుచేరాలి రామయతండ్రి.

బ్యాగ్ — ఆది.

రూపుచూచి భ్రమసితి దానిచూపులకు నేమోసపోతి । పాపిష్టకము నేజేసికొంటి పాపముల క్రొడిగట్టితి బాపురే యీవేశ్యతోనె నోపజాలనయ్యయో ॥బా॥ భార్యాబిడ్డాల బాసితి దానిబట్టి నేమోసపోతి శౌర్యంబు నే జంపుకొంటి చౌర్యమునకు జోరపడుచుంటి । వెలయాలిపొందు నెంచగ మోక్షమునకుబందు పాపాత్ములకు నిందుగూడిన పాపములకు బొందు ॥బా॥ మూతివిప్పినకంపురా మరిదానిఘనమిత్యంబురా జాతి తెలియబోదురా దాని జన్మమున నీచంబురా ॥రా॥ సరసుడాయని రమ్మనిపిలచును నిరసమంత లోనే గన్పరచును పరువుదీయు సారాయిదాగి వడికుళ్ళిచచ్చు నీవేశ్య లింట ॥బా॥

బ్యాగ్ — ఆది.

సరసులార మీకేల యీసాహసంబికన్ । వరుసమీద బైసికిల్సు వడిగ ద్రొక్కుచున్ । తిరుగనేల డి. జి. ల స్ట్రీట్లు తిట్లుతినుటకున్ ॥స॥ హేట్ బూట్ సూటువేసి సీటువిూరగన్ । నోటిలో లక్నోకిళ్ళీలు మాటికి నమలుచున్ ॥స॥ సంధ్యవేళవరకు పార్కు షైరుతిరుగుచున్ గొందులన్ని తిరిగి దాని కొంపజేరుచున్ ॥స॥ చెన్నపట్నం ఆటచేయి చేడెకొంపకున్ వన్నెమీర బోవువాడె వన్నెకాడిలన్ ॥స॥ లోకమామ దానితండ్రి లోప మేమికన్ పోకులన్ని దీరుననుచు బోకుడచటకున్ ॥స॥ చొక్కిదవడలందు కిల్లి నొక్కినమలుచున్ । చక్కదనముచూప పాలగుండసాముచున్ ॥స॥

పద్యం — కన్నడ.

శా. అన్నా లక్ష్మణ బుద్ధిశాలివిగదా యయోధ్యా యరణ్యంబులో
నన్నిట్లొంటిగనుంచి పోవదగునా నీతల్లిగా జూచెదన్
ఎన్నండైన నకల్మషాత్ముడవు తండ్రీ రమ్ము నన్వేగ నీ
యన్నంజేర్చుము పల్కవేమయితివయ్యా వీరరామానుజా.

## జట్కాబండి పాట.

ఉండనీయరమ్మ ముండజట్కావోలమ్మ నిల్వనీయరమ్మ రాడిజట్కా-
వోలమ్మ ఓలమ్మ ॥ఉం॥ ఎక్కడెక్కటికంటేను నక్కిడామన్నాను నక్కి-
డామంటేను పకాపకానవ్వుతారు బండివద్దరి కెత్తేను దండట్టుకులాగుతారు
నిల్వనీయరమ్మ రాడిజట్కావోలమ్మ ॥ఉం॥

మిట్టమధ్యాహ్నానికి మెట్టవరికెక్కితేను మెల్లిమెల్లి గెల్తుందాని ఎల్లని
య్యమన్నాను ఆలాగెఅన్నాడు ఆ రెండట్టుకొన్నాడు రెండుచేతులతోను
రైనీసులట్టుకొని కర్రి ఎత్తెత్తికొడుతుంటే నక్కిడ మొచ్చిందాక బట్టయిన
కానకుండ గాలికి బట్టయన కానకుండ కర్రిఎత్తెత్తికొడతుంటే బండిబొమ్మ
ల్లాయె గుండెకుమోసుకుపోయె కాడి గుండెకుమోసుకుపోయె చేతిగాజులు
పోయె నిల్వనీయరమ్మ ముండజట్కావోలమ్మ ॥ఉం॥

## గాంధిపాట.

కొల్లాయిగట్టితే నేమి మాగాంధి మాలడైతిరిగితేనేమి ॥కొ॥ వెన్న
పూసామనసు కన్నతల్లీప్రేమ పండంటిమోముపై బ్రహ్మతేజస్సు ॥కొ॥
నాల్గుపరకలపిలక నాట్యమాడేపిలక నాలుగువేదాల నాట్యమెరిగినపిలక ॥కొ॥
బోసినోరిప్పితే ముత్యాలతొలకరే చిరునవ్వునవ్వితే వరహాలవర్షమే ॥కొ॥
చకచకనడిస్తేను జగతికంపించేను పలుకుపలికితేను బ్రహ్మవాక్యాను ॥కొ॥

## జంపర్ జాకిట్లులు.

కుట్టించు కుట్టించుబావ జంపరజాకీటు కుట్టించుబావ ॥కు॥ ఏపేటి
జాకీటు ఎల్లాంటిజాకీటు సిల్కుసిల్కుజాకీటు చిత్రమైనజాకీటు జాకీటులో
మంచిబాడీలుకుట్టించుబావ ॥కు॥ కుచ్చుకుచ్చులజాకీటు కూర్పుకూర్చి కుట్టించు
రంగురంగులజాకీట్లు రవునుమెడ పెట్టించు వంగపండుజాకీటు వంకరమెడ
పెట్టించు పచ్చరంగుజాకీటు ముచ్చటగాకుట్టించు ॥కు॥ చుక్కచుక్కల
జాకీటు చక్కగాకుట్టించు జాకీటులోమంచి పేటంచుపెట్టించు పేటంచులో
మంచి జల్తారుపెట్టించు జల్తారులోమంచి పూలతలుబెట్టించు ॥కు॥ చీరెకట్టు

పయికి జారుగానె కుట్టించు పాలకీమొగ్గలను పక్కానె జెట్టించు మెడచుట్టూ కుచ్చులను నక్కిరు కుట్టించు ॥కు॥

## ఇన్నరుచెడ్డీ పాట.

స్త్రీ—కాళ్ళ మొయ్యాసైకిలు కచ్చేరందకాడ కచ్చలోపల ఇన్నరు చెడ్డీ

నీఇన్నరుచూడాలానీ । ఎన్నోసార్లు తిరిగినావు, పున్నమునాడు పొందుకురారావుకోరిడా పున్నమరాతిరి పొందుకురార॥

పురు—జబ్బలమొయ్యాజాకెట్టు । నూరమ్మా జాకెట్టులో జంపరు బాడీ, నీజంపరు, నాఇన్నరిపుడు । జగతికిషేపనులయ్యె జాగేల అబ్బా జాగేల? పిల్లాజాగేల? జాము । రాతిరయ్యే॥

స్త్రీ—మేడమీదాపరచిన పరుపోకూర్రివాడ పాడు...బుగ్గమీద కరచినకరపూ నీకరుపు, పసుపు తనుపుకొచ్చి కంటి [illegible]రాదూ,

కంటికేలకానవురా, అందకాడ తంటాలెందుకు ఎంటనిరారా?

పురు—(లఘువులు) అబ్బోఅబ్బో లబ్జిలాడి అందం సందం చెందిరో లక్కా తోకచుక్కా ముక్కుపుడకారంకుబాడీ చుక్కలచీరె హంసనడకలా॥ అంకాలుబక్కా మాగిపిల్లలాగామనము కలసి పాడుకుందామే,రాయే పిల్లా చూపిస్తాను। రాతిరిసినీమా చూపిస్తాను॥

స్త్రీ—అబ్బనీమొత్తు కాఫీంగోకురర్రివాడా చేసుకోరా ఫెరింగ కటింగూ యీరాతిరంత రయము చేసి టాకీలకెల్లబోక కడగదికన్నించువ రాబుల్లోడా॥

## పుల్లల పాట.

ఆడ—పొయిలోపుల్లలులేవు మామయ్యగారూ ఇంట్లోకి భత్తెంలేదే యేమంటారూ.

మగ—చీటిమాటికి చిల్లరడబ్బుల్లేవంటారూ కాఫీకి బత్తేలుం ఇమ్మంటారు.

ఆడ—మూలసున్నదోయిమామ బట్టలుపెట్టి పెట్టితీసి చూడవోయీ
కబ్బులౌంటాయి।

మగ—తగులుకుంటురాదేమే తాళంకప్ప దీని మీాటెక్కడున్నాదో
రాపేపిల్లా॥

ఆడ—అందమైనదీకప్ప బాగుంది మనుసొప్పను మద్దినున్న బొత్త
గోను సరిపెట్టవోయిమామ.

నా నాగాలొస్తుంది మానయ్యగారు యీదూడనెకడ కట్టేది
ఏమంటారు.

మగ—రెండిళ్ళమద్దినీ నుయ్యున్నాది అనూతిపక్క నాటేసిన
కొయ్యున్నాది ఆకొయ్యికిని పెయ్యికిని కట్టేసిరయేపిల్లా॥

ఆడ—ఆకిచేతనున్నాదోయిమావ జేటకిలైటు అడుపొట్టపగలు,
అరుగుతాడు ప[illegible]రుతోను పరుగెత్తికొచ్చినాడు బైనుకోపికి, నామీద
నొచ్చిపడినాడు [illegible]నకాలికి॥

మగ—నువ్వాడిన మాట్లసొగనూ అవిఆలోచిస్తే తెలుసూ తాలింపు
ఇగురూ నీమీాదనాకు బిగురూ గమ్తడకా రమ్తడకా, రమ్తడకా నేకొడ
తా నేపెడతా, నేకొడతా॥

గుంటూరు గుడివాడదాక దిగబెడతానె చెన్నపట్నం సందులోను,
యిడిసిపెడతానే.

ఆడ—ఓలమ్మా యీాడెంత లయిలుగాడె, ఆడెంత గోటుగాడె,
ఓలమ్మా నొక్కుత్తాడంట పిసికెత్తాడంట (పీకి) కొరికెత్తాడంట - కొట్టెత్తా
డంట గుంటూరుగుడివాడదాక దిగబెడతాడంట చెన్నపట్నం సందులోను
విడిసిపెడతాడంట.

## పిల్లవాడు పాట.

ఆడ—మెల్లంగలేపుమా పిల్లోడిని, మావ సల్లంగలేపుమా బుల్లోడిని
అద్దరేతిరికాడ లెగిసేడుఅంటేను పప్పుపెట్టిందాక వల్లకోడింకాను.

మగ— వచ్చపెట్టెయిప్పి రెండుపాండబ్బాలు తీసి పట్టలేపోనావ పిల్లోడికి ముందు పట్టలేపోనావ బుల్లోడికి.

ఆడ—వచనము-అబ్బ అయ్యేం డబ్బాలోగాని మావ మాసెడ్డెట్టి గున్నాయి నావల్లకాకపోయింది అయ్యిచ్చడానికి.

మగ—నీసేతకాపోతె నాచేతికియ్యావే అనుకున్నట్టాకుండ పిసికి పట్టేస్తాను ॥మెల్లి॥

ఆడ—అద్దముద్దాలచ్చ డెవలదూడో మద్దిసేలోను పడ్డాదిసూపినావా అదిదున్నీసిపోయింది సూసినావా వుత్తిదుక్కు నేసేసింది సూసినావామావ సేనెల్ల సెదిరింది సూసినావ.

మగ—(వచనం) యీరిగోడింటికాడ సేడుగదా ఆడ్ని పంపనేపోనావ నాకాడకి.

ఆడ—బావ చేతికరిచ్చేను సేలోకిసంపేను— అకతాయిముర్రోడు ఆడేంటిచేస్తాడు ॥మెల్లి॥

## కరువు పాట.

కరువువచ్చిందిరబాబు కరువొచ్చింది దేశం కరువొచ్చిందిరా బాబు॥ ॥క॥ ఈపాడుకరువొచ్చి కూడోకూడోయని బీదలు మాడిపోయె ॥క॥ వుడు పుల్లోవానరాదు కలుపుల్లోవానరాదు. తగినకాలములో సుగదువాన కోతలు కోసినవెనుక కుప్పలుకట్టేటప్పుడు కొట్టకముంచేస్తాది ॥క॥ నోటుయివ్వక వసికితేని కోటలోనిపెద్దలొచ్చి, యిల్లు మూడుచుట్లుతిరిగి, కల్లమాటలెన్ని చెప్పి కాఫీయిడ్డునులుయిప్పించి, కాళ్లుఎన్నోఎక్కించి కడకు కాలైనపిసికి పిసికి నోటొక్కటి ఆసిసూపి ఓటుయిమ్మని అడుగుతారు ఓటులు గెలిచిన బిరుదుతోకలు తగిలించుకొని పదవులు పొందినపిదప, పశులకు జేయుడు మేలు ॥క॥

తల్లిదండ్రిపిల్లలంతా తెల్లారితేపొలమెల్లి, ఎండనకవాననకా, పండించినచేలెల్ల గాలివానతోడై గోదావరిపాలైతె, రైతుపైనియనురాగము లేని రాజభటులొచ్చి రస్తాచంకనపెట్టి నస్తులు తెమ్మంటారు, పన్నిస్తేనము

దన్నతేదు, పంటలుపోయినాయంటే పెళ్ళముపుస్తులునైన అమ్మివేసి శిస్తులు యిమ్మంటారు ॥క॥

పనిపాటులేకున్న పండించలేకున్న పన్నులెక్కువయ్యేయి, యన్న గానుకింతకన్నధర్మమా బాబు యిల్లకుపన్ను, సాకిశేవుబల్లకిపన్ను, వహ్వా, మంటికిపన్ను, ముందువెంటకీపన్ను, అయ్యో అప్పుకుపన్ను, పుప్పాసు పన్ను, నీటికిపన్ను, ఆహా బాటికిపన్ను, కడుపు చచ్చినకాటికిపన్ను, చెప్ప లేనిపన్నులెన్నో చెల్లిస్తున్నామనకు ॥క॥ యిల్లువాకిలిలేక, తిళ్ళుకుఅసలేలేక, తల్లి, పిల్లాముపిల్లలు మలమలమనిమాడుతున్న, కల్లుసారావాడు ఖుస్చతప్ప డు బాబయ్యో ॥క॥

మల్లుచౌక అయిపోయిన, మాన్యాలుచౌకైన, దాన్యాలుచౌకైన, యిల్లుచౌకఅయిపోయిన, ఒల్లుగుల్లఅయిపోయిన, నల్లమందుధరతగ్గదు నారా యణమూర్తో ॥క[illegible]టుబండిరేటుతగ్గిన మోటారుబండిరేటు తగ్గిన, అల్లా రైలోడికి, బస్సోడికి రేటుతగ్గదురామయ్యో ॥క॥

## వ్యవసాయం పాట.

రాయంటినా మొగుడు రంగమెళ్ళి తిరిగిరాలేదు నాచేను దున్నాలి నాకు రైతుమంచివాడుకావాలి ॥రా॥ మాయచంగలితుంగ మత్తుగాబెరిగింది తీయలేకను వదులుకున్నాను నాకు దిక్కులేకను మొక్కుచున్నాను ॥రా॥ కావిమేఘములట్టి కమ్ముతూ నెలనెలకు మానకుండగవాన కురుసూనూ లోమ న్యాములో తొలకరించేను ॥క॥ బీటుచేనువాది వాటముగదున్నాలి రాటు కూపోటుకూ ఆగాలి ఆరైతు మోతుబారైయుండాలి ॥రా॥ యేటికోలకు నాగలెలుపు పన్నేయించి మోకైనగట్టులాగట్టాలి ముప్పొద్దు యినుమారు తోలాలి ॥రా॥

గడవలున్నాకాడ కరుకోలతగిలించి కాళ్ళెత్తి నొక్కితే గడ్డంత యేళ్ళతో భళ్ళుభళ్ళున పెగిలిపోవాలి ఆబలిసియున్నాగడ్డి చావాలి ॥రా॥ గుండ్రిదిబ్బలపైని రెండుచేతులతోటి గండ్రినాగలి మేడిపదలకుండ నిలుపు

కోండో్రిసి నొక్కితేనా గాలి రేగాడిరో పటాలములగాలీ ॥రా॥ మెరకపల్లకేసి మెత్తగాదున్నాలి తరగకుండానీరు చెరువులాగుండాలి యిరుగుతరుగులేకపండాలి మాయెగసాయెమేబాగుచెయ్యాలీ ॥రా॥ యెవరైన చేయగలిగినూసుకోండి యీవలావలగట్టు లోవలోవలగాడి యిరుసుపుంతకుదారి విరించిచూసితే యెదరమోకున్నాదె మా చేను యిష్టమైతే కవులుకిస్తాను ॥రా॥

## మారుమనువు పాట.

మారుమను వెళ్ళిపోతానోయి కంసాలెంకయ్యా మామ ॥మా॥ నేరా పెండ్లాడానోయి కంసాలెంకయ్యమామ, మెళ్ళోకి గుళ్ళాపేరు, కాళ్ళ కడియాలయ్యా, చేతులకు గాజులయ్యా, వంకర టింకర లేక బింకము చెయ్యాలి నాకు బింకముగ చెయ్యాల ॥మా॥ ఆళ్ళకి యీళ్ళకి ఎనక చేత వుగాని ముందు నాకు చెయ్యాలయ్యా శంకాలా పేరు [illegible] ॥మా॥ పని పాటు చెయ్యాలేమా, కూలినాలికెళ్లామంటే కరా [illegible] చూపిస్తాడు కర్రిచూస్తే నాకు ఎర్రెత్తిపోతాది మామ ఎర్రెక్కిపోతాది ॥మా॥ ఎర్రిశేకరోకాలుందని, నల్లధువరోకాలుందని, ఎంచుకోనీనన్ను దంచుకోమన్నాడు వంచకింద దంచుకోమన్నాడు ॥మా॥

## కుం డ పా ట.

కుండకరీదియ్యర నామగడా । ఓహో కుండకరీదియ్యర నామగడ కుండకరీదియ్యకుండ గుమ్మమింకదాటనియ్య । కుండంటె కుండగాదు రా యివంటి కొత్తకుండ । ముద్దూలొలుకూకుండ । చేతికిరువయినకుండ । చల్లానిరంగుకుండ । చక్కనైన చుక్కకుండ । సాటిలేనిగట్టికుండ ॥కుండ నామగ॥ కావెరంగుచీరగట్టి కాలామట్టెలుబెట్టి । నుదుటాచుక్కానుబెట్టి పుక్కిటాతమ్మబెట్టి । కుండాబుజానబెట్టి కొంటాచెయ్యానుబెట్టి రోయబట్టురవికదొడగి । కొంగూజీరాడగట్టి । తీపైనపునీరుతెచ్చె నిలువైననామకుండ । కుండ ॥ నాబావడా కుండంటె కుండగాదురా॥ పదునైన బంకమట్టి మంచిమంచి పాలువేసి । వాసం శెట్టిశెరయ్య । పట్టిపట్టి నొక్కినొక్కి

ెట్టునుగాచేసినట్టి । దొంతశెట్టి శేసమొంతో మొట్టీమొట్టి చేతపట్టిచూచి ‘ట్టిదీసుంట ॥కుండ। నామగడా॥

## సాకిరేవుబల్లకాడపాట.

మంగమ్మాసాకిరేవుబల్లకాడసంగతీ, నీచక్కదనముకాలిపోను ను క్కలాంటిమంగమ్మా ॥సా॥

నున్నటిబల్లమీద సాగదీసికొడుతుంటె॥ నీకష్టముచూచి నామనసు యిష్టాపడదుమంగమ్మా ॥సా॥

సాకలిపేటమేటిమేస్త్రీ చెలులుచలాకియైనది ఆట దాని సపతించిన సత్యము నాయుడు కలిసి యున్నాడటా వరేవ యీవిందరికి యీడుజోడు యిమిడియున్నాదటాతజకా తాటికల్లు మజాకా మాపిటికి చిక్కాలోరు సందులోను చిక్కిపోతావుమంగమ్మా ।సా॥

సంకాన[illegible]ుగుమీద సక్కగా నేతోంగుంటే ముక్కవగా నీ వొచ్చి మాటలాడబోతావు యిద్దరముయిక్కడవుంటే యీలుదక్కదు యింకమనేనియాబాటకాడ మాటలాడుకుందామె ॥సా॥ కుచ్చీలు కుదగట్టి జెబ్బలపైనిజాకెట్టు కోక చెంగులెగ్గట్టి రైకముళ్లువిడగట్టి అప్పుడునీమనస్సు నామనస్సు నీరైపోతాదే ॥సా॥

ఆయోటపారంతడకా సందులుగొందు ముక్కుబుడకలునకు జోడు నత్తుకాడ. కొనకమ్మలు నీసంకనమూట నోటులోనుట్ట ఎదురొస్తే నామనస్సుకుదురాయిపోతాదే ॥సా॥

## పాట.

నిలునిలునిలుపుబలి నిలుపురపూజారి పలికించిమరిమాట చదేవదేమేద్దామా ॥ని॥ మేకపోతులుకొన్ని మేలుగా తెచ్చాము నీమ హిమచూపిస్తే నీకేయిస్తామమ్మ ॥ని॥

అమ్మముందరిచప్పు అమ్మోరికెట్టుమంది ఎంగిలిచేసేవంటె ఏత్తాను చెంపకాయి ॥ని॥ అన్న తీకామున్న అరటిపండేదిరా, అందుకోరావండు అమ్మోరికెడదారి ॥ని॥

చూచినావు పిన్నమ్మ పోతురాజేవీటకర్రి ఎనుబోతునెయ్యాడాః
కెంతలావున్నాడో ॥౨॥
పట్టుకోరారెండు అమ్మోరిపాదాలు కొట్టరా గద్దిమీద కొబ్బరికాయల
మూడు ॥౩॥

## గొల్లవాడుపాట.

రానుపోర గొల్లోడా రాతిరివల్లోడా రానుపోర గొల్లోడ నన్ను ముట్టరాకు శామాలుగలవాడా సేబాస్ గొల్లోడ చెయిసయిగలు చేసేవురా కొంటితనము మారెంటిపైనున్నాను ॥రా॥ నిన్నసేవచ్చేను నన్నునీవెరుగావా కనుగింతలలోనే కనుగానకున్నావా ॥రా॥

పంచభూతములలో పరిభూతమైననేను అండబ్రహ్మాండనూత్రింలో వున్నాను ॥రా॥ ఏడుఅంతస్తులలో యిాడపింగలమధ్యములు కాంతిరంగులతో యేకాంతమైనాను ॥రా॥ తొమ్మిదిశేరుల తూగు[illegible]ల్యాలలో యేజోలి లేకున్న నాజోలినీకేల ॥రా॥

నిండుపౌర్ణమివాడు పండువెన్నెలలో శరపూర్ణతొట్టిలో పండినిండున్నాను ॥రా॥ పరమపతివ్రితనేను పదిమందిపతులునాకు పిన్నాపెద్దలు చాలా పేరిమతోను మొర్రిక్కెదరు ॥రా॥

మూర్ఖురాలనుకాను ముక్తికాంతను నేను కన్నకొడుకూతోను కాపురము చేసేను ॥రా॥ త్రిపురసుందరి నేను త్రిలోకమునముంచి మేరుఅప్పల నాయుడు మేడమీదవున్నాను.

## పాట.

ఏరాలతెస్తానె యింటిలోపెడతా ఏరాలమాటవినాల సుందరిపిల్ల
యేరాలిమాటవినాలనాయుడోలమ్మో ॥ఏ॥ యేసులాడుకుతానూ యేరొండిపెడతాను యేరాలిపోరుపడలేను సుందరిమగడ యేరాలిపోరు పడలేను సోకుదారిమగడ ॥యే॥ (3) వండిపెట్టలేవా వడ్డించలేవా కోనేటినీళ్ళు తేలేవా నాయుడోలమ్మో కోనేటినీళ్ళుతేలేవా సుందరిపిల్ల ॥యే॥ (4) కూరంటేలెగలేను కూడొండిపెట్టలేను కోనేటినీళ్ళుతేలేను సోకుదారిమగడ॥

॥యే॥ (5) బంగారములాటిదిరా ఔంగుళూరుగంటూ దానినడుము నాగబంధ ములే సోనుసారిపిల్ల దానినడకహంసనడకలే నాయుడోలమ్మి ॥యే॥ (6) దాని పోలోను పడబోకు నాయుడుబావా దానిపోనులోనుదిగబోకు సుందరిమగడ ॥యే॥ వడ్డాణమిదిగోయె ముద్దుముండాకాసా నీనడుమ్మకైన పెట్టుకోయె సుందరిపిల్ల నీనడుముకైన పెట్టుకోయెవాయుడోలమ్మి ॥యే॥ (7) ఎప్పు డెట్టుకోవాలో అప్పుడెట్టుకోవాలి పండుగపున్నాలకి సోకుదారిమొగుడ అది అప్పుడెట్టుకోవాలి సుందరిమగడ ॥యే॥

## ఆనందభైరవిరాగం — ఆదితాళం.

చందమామ॥ చందమామ॥ చందమామ॥ యీసంధితెలిపే జ్ఞానులెవరే చందమామ॥ చం॥ కాయమనేపుట్టలోను చందమామ - పాము - మాయగనె మెలగుచుండు చందమామ॥ చం॥ పవనకుంభకంబులోను చందమామ - పాము ప్రిహరితిరిగి య[illegible]డునయ్యా చందమామ॥ చంద॥ బంట నాగస్వరములూది చందమామ - పామును - అంటియూది లేపవలె చందమామ॥ చం॥ తోక ద్రొక్కితే నేపాము చందమామ - కోపముతో లేచునయ్యా చందమామ॥ చం॥ రాకపోకలేకమైతె చందమామ - పాము లోకాలోకము లేలునయ్యా చందమా॥ చం॥ తొమ్మిదివాకిళ్ళుమూసి చందమామ - పామును - నెమ్మది గా పట్టవలెను చందమామ॥ చం॥ భక్తియనేకట్టుకట్టి చందమామ - పామును యుక్తిచేసి పట్టవలెను చందమామ॥ చం॥ దేహీదేహములపందు రందమామ - పాము - తెలియకుండా చుట్టుకున్నది చందమామ॥ చం॥ ఆజపమంత్రిధ్యా నముచేత చందమామ - పాము - అఖండకళతో వెలుగుండు చందమామ॥ చం॥ పామునుబట్టేజోగి ఎవరె చందమామ - ఓహూ అతనిపేరే సిద్ధగురుడే చందమామ॥ చం॥

## పూలదండ పాట.

1. ఓహోమామయ్యా, చిన్నమామయా యోమంచిమామయా మామయ్యా, మామంచి, చేసిపెట్టు మామయ్యా

కాగితాల కనకాంబ్రిపూవుః॥ గుచ్చిపెట్టు మామయ్యా
కాగితాలకనకాంబ్రిపూలూ॥ చేసిపెట్టుమామయ్యా ।కాగి।

2. రకరకాలపూలు, రంగూరంగూలపూలపూలు. సాన్నిమా
సాగసైనపూలు, చిత్రాచిత్రాలపూలు, చేసిపెట్టు,
మామంచిపూలు, మామంచిపూలు, చేసిపెట్టు,
మామయ్యా, గుచ్చిపెట్టుమామయ్యా, ॥కాగి॥

3. నేనెంతో ఆశతోను, ఎన్నోరోజులునుండి, గుచ్చుతా
వనుకొంటి వక్కరోజైనను గుచ్చలేదు
మామయ్యా, నీవుచేయులేదు మామయో, ॥కాగి॥

4. నామనను కుదిరింది, చేసేననుకుంటాను, బాగా చేసే
వనుకుంటాను, అందగా గుచ్చావనుకుంటాను,
దండా గుచ్చావనుకుంటాను, దగ్గరగా గుచ్చావను
కుంటాను......మళ్ళిజన్మాని కైన మరచిపోను మామయ్యా,

5. ఆపువ్వులు జతగాను, వాడంబ్రిపూవులు, నీలాంబ్రి
పూవులు, రెండుపట్టుకోని, రెండు గట్టిగాపట్టుకో।
నెమ్మదిగ పట్టుకో గట్టిగానలిగిపోకుండాను
నొక్కులవకుండాను, పూలు జారిపోకుండాను,
చేతులు పీకులనకుండాను, గుచ్చిపెట్టు మామయ్యా,
చేసిపెట్టుమామయ్యా ॥కాగి॥

6. పూవులు, పైడప్పుగుచ్చుకొంది, ఎల్లప్పుగుచ్చుకుంది,
నాసవతి అల్ల సరప్పే గుచ్చుకుంది, వారందరికంటా
బాగాగుచ్చిపెట్టు మామయ్యా చేసిపెట్టుమామయ్యా ॥కాగి॥

7. పూవులన్ని కింద జారిపోకుండాను, రేఖలన్ని తెగి
రానిపోకుండాను, రేఖలన్ని బాగా యిప్పేసి, గుచ్చి
పెట్టు మామయ్యా, చేసిపెట్టు మామయ్యా ॥కాగి॥

## కూలోడ పాట.

ఎండలో వానలో । ఏనాటి కానాడు, బండచాకిరిచేసి
బ్రతుకుతావేగాని, దినము నీకూలితో కూలోఢా!
తిండైన దొరుకునా కూలోడా! 1

కర్మమంటూ వాకరి ధర్మమంటావు, నీకడుపు మాడ్చుక దొరల
కడుపునింపుతావు, కష్టమంతా నీది కూలోడా!
కలిగినోళ్ళది సుఖము కూలోడా! 2

పగలు రాతురుల్లు పాటుపడి నీదొరకు పండించి కొట్లన్ని
నిండించుతావు మరి పట్టెడన్నములేక కూలోడా!
పక్షిలా తిరుగుదువు కూలోడా! 3

పండినా యెండినా భయమేమి లేకుండ దండిగా నీదొరకు
ఘనధాన్యములచేర్చి పనిలేనిచో నీవు కూలోడా!
పస్తే పడుండాలి కూలోడా! 4

పాడి పంటలుగల్గ ప్రభువు లుంటానికని మేడ మిద్దెలుగట్టి
మిగుల శ్రమపడు నీకు ఉండ నిల్లూలేదు కూలోడా!
పండ మంచములేదు కూలోడా! 5

దొరలు నీచాకిరిని దోచుకుని తింటూంటె తిరుగబడి నీవెపుడు
తిప్పలెడతావో యని కర్మమని చెపుతారు కూలోడా!
కంగారు పెడతారు కూలోడా! 6

పంచదారనుమించు పండ్లునూ చిరుతిండ్లు ఎంచరానివి ఎల్ల
ఎవుడు తండిస్తావు కంచమన్నములేక కూలోడా!
కుమిలిపోతున్నావు కూలోడా! 7

చీనిచీనాంబరాల్ చిత్రముగ నేస్తావు వాటి నన్నిటి దొరల
వశముచేవే నీవు జానెడైనాలేక కూలోడా!
చలిలో నెచస్తావు కూలోడా! 8

గొప్పోళ్ళు నలుగురూ కూడి నన్నలయించి రెప్పుడూ సుదపడుట
యేమి టంటావనే తప్పుడూశాస్త్రాలు కూలోడా!
దాపరం చేశారు కూలోడా! 9
రాయిలాగున్నపుడు హాయిగా చేయించి నీగడ్డరక్తాన్ని
నిలువునా పీల్చేసి డీలుపడిపోగానె కూలోడా!
దగ్గరకె రానీరు కూలోడా! 10
నీకష్టమే లేందె నిల్వలేనీదొరలు ఏనాడు కష్టపడ కెదురు
తిరుగుదువా యని దైవశాసనమంచు కూలోడా!
తలపైకి నెట్టేరు కూలోడా!

## రాధారిబోటు పాట.

పడవ తోసెయ్యకో సరంగుబావా
నేవస్తూ ఉన్నానోయి సరంగుబావా
సేపలన్ని అమ్మినా సరంగుబావా
తావమెత్తిపోతుంది సరంగుబావా
సరసమాడుదామో సరంగుబావా
మురువుజూపి హరువుచూపి సరంగుబావా
ముద్దుపెట్టి పరువునిలుపు సరంగుబావా
కడగదిలో చోటుంచు సరంగుబావా
పడియుంటానందులో సరంగుబావా॥

## కామిక్.

సిన్నదాన నీవెంతటి కులుకులాడివో ॥సి॥
సలవా సీరెకట్టి సెంగపువ్వుల రవిక తొడిగి ॥సిన్న॥
తళుకు బెళుకు మెరుపునడల్తు వదుముపిల్ల రాయే
పోతుగాడ నీవెంతటి సీటుగాడవో ॥సి॥
నూగుమీసమద్ది మొగముపైన బొట్టుదిద్ది
రాయోరాయె పిల్లమంటె వత్తనంటరా నేను ॥సిన్న॥

## కామిక్ — పేకాట.

ఈయాటలన్నిటికి మించి చెలంగెను అందమైన పేకాట । పొరపాటు చేతనే లేటుచేసితిని చేయిదొరకదీపూట । అకటా యిచ్చట నేమాటలాడగ జాల నామనసునిల్వదీవేళ । వేగన్ ప్రవేశింతున్ యికన్ గెల్తున్ తమాషా జూతున్ వహ్వా నిజమయినయాటరన్మ్రృతు రక్షించి డబ్బురాగోయ ఇదిజూచువారు మరిపోరు తప్పన్నవారు మరిలేరు । బ్లయిండంచునొక్కడొకమారు పదిరూకలువేసేతీరు । త్రిప్పంచుపల్కుచున్నారు మూడాసులుంటజూచేరు బేజార్ మదిన్ పలుసార్ చెడును యాళన్ బాటా యీపేకాట । పది వందలుపోయినవెనుక మరిపుట్టెను నాకడిగయిక । జూదర్లకు వృత్తిది గనుక మురుగుల్ దుద్దుల్ తీసి ఆడిఓడేయాట ॥ఈ॥

ఈరోజున కట్లయినాడు మరునాడు తిరిగివెళ్లేను । తనయింటిసొమ్ము లొడ్డేను తాకట్టుపెట్టి యాడేను, మరిపోయి వదలిపోలేదు దేశంబులపాలైనాడు, నూరుదాసుండిన దెబ్బేను, వదలన్ వేగన్, అనుభవమయ్యెన్ నాకున్ ఇపుడున్ ॥యీ॥

## సారాయి పాట.

వారెవవ్వారేసారానిషా శాయుగగనీ, నిషాశాయగ బల్ హుషారయ్యెడిని ॥వా॥ డ్రామును వేసి ఛీ చాలదనిరోసి । అరడ్రామును తెమ్మని యాచన చేసే ॥వా॥ పట్టురువాళ్లు జరీపాగలను బెట్టించున్, కోట్లు వాచీగొలుసుల్ రొదువబెట్టి త్రాగించున్, చీకుపుల్లలకు నాలిచీకలైన యమ్మించున్ చాటుగాదూరి త్రాగిపబ్లీసన తావచ్చున్, కూనరాగంబులతో రొసరు రొంపకును చేరున్, ఆలిని మాని పడగొట్టి మంతిట్టి వదుచుపోగును నీ ॥వా॥ ఆడుచున్ కొంతసేపు అదియే మొయని పేలున్, పాడుచును కొంతసేపు పరభామలను వలచు నీతల్లిదండ్రులుతిట్టిన కరిమి వారిపడగొట్టున్, గాన సారాయినింక మాని బ్రతుకవలెనీ ఓరనీ, ఘనమూడును నిషా బాజీకిని ॥వా॥

పద్యం — మాండ్.

సీ. ఎన్నిరూపములు నీయెడల గల్పించిన దనివిలేదయ్యా సత్యస్వరూప, ఎన్నిభావములు నీయెడలగల్పించిన నంతులేదయ్యా వేదాంతవేద్య, ఎన్ని వేషములు నీయెడలగూర్చిన మేరగనుపట్టనయ్యా అఖండతేజ, ఎన్నిరాగములు నీయెడల బాడిన దృప్తిగలుగదోయి సామగానలోల

గీ. ఎన్నివిద్యలు నేర్చిన నెరుగరావు పారమంటని యాభక్తిభార మయ్యో, పారవంశపుమత్తు మందరవిరామ రామ రఘువంశసోమ శ్రీరామ రామ.

## నటకావతంస స్థానం నరశింహారావుగారు, తెనాలి.

జోగి — ఆది.

ఈ॥ యోగజలధి గడచినగదా । యేనుముదముగనుటా ఆఆఆఆ॥ఈ॥
ఓనలినీ నిశాపమేయుగంబుగా యుంటిగదా కనులార గనవో ॥ఈ॥
ఏవిధముగ గడుపుదునో కాలము । యెన్నడు మా గోపాలుని గాంతున్
ఆహా చెలీ భరింపగా గలనో ॥ఈ॥

## శకుంతల విరహము.

వచనం.

అప్పుడది ప్రశాంతాప్యమారామము. అందు నవయవ్వన విలాసిని యగు శకుంతల పూసెజ్జపైబవళించి దుష్యంతు నతిగా తలంచుటచే విరహావస్థ నొందుచున్నది. ప్రక్కన యిరువురు చెలికత్తెలు తామరాకు వీవనలతో వీచుచు నిలువబడిరి. శకుంతల వారినిట్లు వారించుచున్నది.

జిల్లాజంఝూటి — త్రితాల్.

ఏలవీతురమ్మ నాకు జాలమైక మానుగా । మూలకారణం బేమన్నా తెలుపజాల సఖియలార! ఏలవీతురే నాకు చాలమైకమానుగా । అలుక గాదు కలతకాదు చలిచలిగా పుల్కలొందవు । నిలుపుకొందమన్న మనసు నిలువదమ్మ సఖియలార! ఏలవీతురనాకు చాలమైకమానుగా । తాపభార

నూపనోవ రూపుచెదను కెదవృలదరు । యేకగిదియు తోచదమ్మ రేపామాపా నాపనిసరి । ఏల ఏల నీతురేనాకు చాలమైకమూనుగా॥

### ఆశ.

అమీర్ కల్యాణి — ఖండగతి.

కన్నీటికెరటాల వెన్నెలేలా । నిట్టూర్పుగాడ్పులో నెత్తావియేలా ప్రళయకాలమహోగ్ర భయద జీమూతోదయ । గళఘోషగంభీర పెళపెళా ర్భటులలో మెరపేలా ॥క॥

అతనిపాదంబులో అంబువేలా హాలాహలంబులో అమృతమేలా । ప్రబలనీరంధ్రాభ్ర జనితగాఢధ్వాధ్వ । నిబిడహేమంత రాత్రిసంతమసము లలో చుక్కేలా ॥క॥

శిథిలశిథిలమ్ములో చిగురేలా । పాషాణపాళిపై ప్రసరమేలా । విక్ర తక్రూరక్షుధా క్షుభితముచ్ఛ్రితఘోర । వికట పాండురశుష్క వదనదంష్ట్రా గ్నిలో నవ్వేలా ॥క॥

### యశోద పిలుపు.

కల్యాణి — ఆది

నిలునిలు బాలక తుంటరికృష్ణా । నిలునిలు బాలక మోహనకృష్ణా నిలునిలుబాలక యదుకులకృష్ణా । నిలునిలు బాలక ముద్దుకృష్ణా । ఏగతి నోచ్చునో నీమృదుపదములు । రయమునపరుగిడ బోకుమాకృష్ణా క్షీరభాండ మును పడద్రోసితివని । మాతృదండనకు సరగునబారకు । నీకన్న నాకెవ్వా రురా । యిక కడుపుననిడుకొని । తడయక కాచెద । అలసిపోతివయ్యో నాబాలక । నిల్చినదువరా యికనైన । కలుషమునగ నీవింతదూలిన కోమల మగు । నీతనువు కందకయో॥

సారంగ — ఆట.

జైభారతమాత జైభారతమాత । జైమాత ప్రభూతచరిత నమస్తే॥జై॥ వరవీరచరిత సారసతర సుధారస కవితా ॥జై॥ కన్నతల్లి కల్పవల్లి నీసుతు లను నీకోమకుల మము । మరువకుమా ॥జై॥

పద్యం — నాదనామక్రియ.

మ. చెడుగా యేపని చేతగానియెడ నాచేనానె ముప్పాటలున్
కడుపుబ్బన్ నినుమేపనంచు తనువున్ గాయాలుగాకొట్టినన్
పడలేకావ్యధ పాణిభీతి గురు డమ్మా చూడవేయంచు నా
కడకేతెంచిన పుత్రికష్టగతి నాగర్భంబు ఛేదించెడిన్

శ్రీరాగం — త్రిపుట.

జో జో ముద్దుల గోకులబాలా జో జో సుగుచిరఘునశీలా జో జో లాలిసద్గుణా మణిఘనజాలా ఇందిరాముఖ పంకజలోలా ॥జో॥ సుందరార్చితా సన్నిధిపాలా ధీరమునీశ్వర సముదయపాలా ॥జో॥ పూనివేడిన కరుణను మీరే । సాగరమంతయు పొంగుచునుండె ॥జో॥ వానరసేనలు జలధినిజేరి వానువు సేతువు కట్టకమీరే ॥జో॥

పడవ పాట.

పడవెళ్లిపోతుందయా రంగురంగులపడవ రమ్యమైన మాపడవ
లక్షరూపాయలపడవ రహదారిబాటుల
రాపెట్టి గీపెట్టి యేస్పించుమాపడవ ॥ప॥
జోరుసెయ్ బారుసెయ్ జోరుసెయ్ బారుసెయ్
మీరతెల్లవేగరండు మించిపోవుచుండె టయిము ॥ప॥
రైలుచార్జీలియ్యలేక లంకణాలబోటుకొరకు
కాచియుండి బేరమాడ కానితక్కువబేడకొచ్చె ॥ప॥
మొదటిరేటుకొంచెమా పిదపరేటు రెండురెట్లు
యేటినడుమకెళ్ళాక యిచ్చిందాక పేచీపెట్టె ॥ప॥
అడిగినంత యిచ్చిందాక పడవనడప కచటనుంచి
యేటిమధ్యమిడుకుతార యిచ్చి మాకు మొక్కుతార ॥ప॥
పెక్కునొక్కులు నల్లిరక్కులు పీతచిక్కులు చాలగా
నిక్కడున్నయి యేగరండు మించిపోతెదొరకనట్టి

జోరుసెయ్ బారుసెయ్ జోరుసెయ్ బారుసెయ్
హైలేసో హైలేహైలేసా హైలె హైలేసో హైలేసా॥

## బాపనయ్యపాట.

అయ్యలూ బాపనయ్యలూ మీరెన్నికొంపలిరి రాయ్యలూ
గాజురోయ్యలు పప్పురోయ్యలు యిరోయ్యలు
దామడరోయ్యలు బుంగడరోయ్యలు సింగడరోయ్యలు ॥అ॥
యీనురోయ్యలు యెరగిరోయ్యలు పిట్టరోయ్యలు
కండాపురోయ్యలు చిన్నరోయ్యలు మలపురురోయ్యలు ॥అ॥
కంపుకంపుంటారు యింపుగతింటారు
మీరెల్లతింపేనే రేటెల్ల హెచ్చయ్యో ॥నయ్య॥

## మూడవపెళ్లిపెళ్ళాం పాట.

మందుతిం[illegible]నన్నది మూడవపెండ్లాము ॥మందు॥
అర్ధసేరు ఆవుపాలతో పావుసేరు పంచదారతో
నీళ్ళుకలపనిమజ్జిగతో నిమ్మకాయపచ్చడితో ॥మందు॥
జున్నులేహ్యం తీసుకొని వెన్నఅప్పాలుతింటూ
నున్నియుండల మెసవుమను నున్నితముగా కణము నిచ్చెడి ॥మం॥
పావుసేరు పెసరపప్పును పానకము గోవాలపండు
పావుపీశెఖర్జూరమును పదిలముగా బజాయించి ॥మందు॥
వేడియిడ్డెను ఉపమా మాసిపోనిదోశ పెసరట్
పూరీబంగాళదుంపకూరతో కాఫీయను పానముంచుక ॥మందు॥

## యింజనుపాట.

ఆహా యింజరము! ఔర యింజరము! అయ్యో ॥ఆ॥
కుంజరముపలెనుండి గుంజినా తిరుగవేమె ॥ఆ॥
తెల్లకంపెనీలోన కలకత్తాలోగొంటి
చెల్లయ్యోనామాట చెల్లయ్యోనాతోట ॥ఆ॥

సంచులాదిగా ధనమర్పించి వైచితి
పంచపాత్రనీళ్ళు రాక వంచనపాలైతి ||ఆ||
మేలైన ఉనివాంఛశ్రీ జాలరప్పించితి
కూలినాలికిగ్రింద గొంపనే కూల్చితి ||ఆ||
తోటలెల్లపాడయ్యె మూటెల్లవ్యయమయ్యె
నీపైనకన్నీటనిట యేడ్వనయ్యె ||ఆ||

## కామిక్.

పోరా ఛీపోరాలేదిపో ఛీపోరా
వేషాడలాడక నీవు నోటగుడ్డకుక్కుకోని ||పోరా||
వేజలైను రోజుసెంటు రోజురోజు తెచ్చిబోయ
మోజుతో నిను జూచినాము మోజుపోయెధనముపోవ ||పోరా||
ఇచ్చివంతవరకునిన్ను మెచ్చిమెచ్చిముద్దులెన్ను
యిచ్చికనులకద్దుకొంటి చచ్చువెధవనైతిగాని ||పోరా||
గంజికైన నీకులేదు ముంజేవంటి లంజెయేల
గింజకొనక నాదుపేరులు జించుకొనుచులేచిపొమ్మ ||పోరా||
పైకమునీ చెంతనుండ వలపు మాకు నిల్చురా
పైకము నీచెంతలేదు వలపుమాకు మొదలెలేదు ||పోరా||
రాగిపైసలేదుగా విరాగివై పోతివా
జోగియైనవానికింత భోగములెట్లొదవురా ||పోరా||

## కుంపట్ల సుబ్బారావుగారు, మైలవరంకంపెనీ, బెజవాడ.

నాకేసిచూచినా నావాసిజూచినా నాయేసాన్ని జూస్తేను యేయింతిపైబడదు । మీసాన్నిసవరించి రోసాన్నిజూపించి । కూసింత కనుగీస్తె గుమ్మయిపోవాల ॥నా॥ అందాలలోపల సెందూరుడయ్యేను । యెండి మొలతాడుమెట్టి వండిపాగాజుట్టి । అందం సంపం గలిగినేను హౌసుమీద నిలచుంటే । డాబుసరిచాలా చేస్తే డంగైపోవాలా ॥నా॥

కామిక్ — ఆది.

మెఁగంబులవలె వగల్ దిరిగితివి దిగుల్ పడఁగనేల । యిటువలె వగం గుందనేల । శాలానన్నిటుల వెలార్చెదవ యీపాలనకేకిమీద । నైకొను సలాము చెలిపోఁడ । కటాక్షించెదవె తటాలునని నన్నిటేల దయామంతి సొగసుల మిటారిమేల్ బంతి । జోహారునిను బోం దివాళిదేలక ఆహా విడువ జాల । మరుషులి కీహావడికి తాళ ॥ మె॥

కాంభోజి.

ఉ. ఎంచఁగరాని చక్కఁదన మేచిన వేడుకకాఁడటంచు మా
చెంచుపలంతి చేడియలు చెచ్చెరనా చిరునవ్వునందగా
లంచములిచ్చి పైబడి సలాములొనర్చెద గట్టివాని మొ్రి
క్కించితె గట్టివాఁడు కలికీ నేమనువాఁడ జెప్పుమా.

కామిక్ — సానిసరసుల సంవాదము.

హా హా నీకేల యీగండుతనము మగఁడ । మగఁడ నీకేల యీగండు తనము టీకు టాకు జూపినా నాకేమి ఘనము ॥నీ॥ పున్నమ్మ గారీయాచిన్ని నూఁతమగఁడు । గున్నయ్య యెంతో మంచివాఁడు । దాని పున్నెముతో దొరికి నాఁడు । నగలెన్నెన్నో చేయించినాఁడు పూరకున్న తానెవండుతాఁడు । దాని కన్నము పెట్టుతాఁడు । తిన్నాక తీనుతాఁడు ॥నీ॥

తెల్లవారఁగలేచి యిల్లుగుమ్మములూడ్చి । కల్లాపు తాజల్లుతాఁడు । ముగ్గులెల్లా తానె పెట్టుతాఁడు పెరుగు చల్లా పాలు దెచ్చుతాఁడు । కడవ నీళ్ళుగ దించుతాఁడు దాని వొళ్లెల్లబట్టుతాఁడు పిల్లలను సాకుతాఁడు ॥నీ॥

కామిక్ — సానిసరసుల సంవాదము.

నీకేలోపముజేసినానే బాలా । నిందించుటదేలా గుణశీలా ॥నీ॥ నీగ లపై వెన్ననెత్తి మెల్లగరాసి । బాగా మొటికెలు నిలువలేదా । సొగసుగా కురులుదువ్వలేదా । చందిలాగా దూరపుచ్చలేదా । అనురాగంబున నుండ లేదా । నీవాగుమన్నచోట నాగుచుంటిగాద కాఫీనీళ్లుగాచి । ఫీఫీహల్వా జేసి । నీపాట్లనింపూటలేదా । నిన్న తోపుచీర తీయించలేదా ।నగలు రేపే

నేచేయించేదా । నాపై కోపించుటిదిమర్యాదా । ఓసీ నీపుణ్యముంటుంది నాపర్వదియ్యాకె ॥నీ॥

కామిక్.

కొట్టకురా యిడుములు పెట్టకురా పడతిని గట్టసరా దండము పెట్టెదరా ఉద్దండానను ॥కొ॥ పొట్టనిండ తిండికూడు పెట్టవలయు పిల్లలకెల్ల పుట్టినవారినెల్లను పోషించుటె బలెకష్టము ॥కొ॥ అరవకురా పెండ్లికి వెరవకురా అది నాకొద్దబ్బా । యిదిగోరడాదెబ్బ అబ్బా వచ్చినది సిగ్గునావళ్ళు భగ్గుభగ్గుమది తెచ్చి పూచి మరివచ్చినది గుత్తి ॥కొ॥

కామిక్.

వద్దువద్దంటె మెడగట్టినావు పెద్దయెద్దంటి పెండ్లాన్ని నీవు ॥వ॥ ముద్దుమాటలు పాలెట్టుతాది । మాటమాటకు అల్గిపోతాది యూసంటే గుంజిల్లు మాకు లేబడితేనే మొట్టికాయలు నాయనా । మోటాలుకాలుదె మాడువింత చూచి కొట్టితెమ్మన్నాడు ॥వ॥ ఆలుగాదని యూరోతేలు అంతకన్నా చావు చాలమేలువీలాగు । పొమ్మంటె ఏసుస్తాది అదేమన్నే దుఃఖమొస్తాది ॥వ॥

ఎం. అబ్రిహాంగారు, బెజవాడ.

కామిక్.

కల్లుముంతామాయమ్మా నిన్ను మరువజాలనే ॥క॥ అమ్మ నీను కంపుబలే కమ్మగున్నది, యిమ్మహీస్లీ వెన్నతరమె జన్మమెందుకే ॥క॥ తన్నులాటసనీవు తాతవోయమ్మా, గుద్దులాటకునీవు గురువోయమ్మా ॥క॥ కల్లుకెళ్లెటప్పుడు మేము కలసివెళ్ళెదము, మళ్ళివచ్చేటప్పుడు మేము మాటలాడము ॥క॥ పుల్లిపాయపకోడీలు పుడుకుతున్నవీ, యింటికొక్క కల్లుముంత ఎగురుతున్నది ॥క॥

కామిక్.

ఎగిరెజట్కాబండి నడిచెవోం ఎద్దుబండీ ॥ఎ॥ గుర్రాలుకేసింది గుర్రబ్బండీ ॥గు॥ ఈమూడుజాతులు కలుసుకొని పూడబొడిచినరైలుబండి. కమురకంపు బొగ్గునీరు తోడుతెచ్చన్న ॥ఎ॥ పుడకెయెలగకూర మొలచె ములగ

సూర, గుడ్లెర్రజేసింది గురకకూర, యీమూడుజాతులు కలుసుకొని, వ్రూడ బొడిచిన గోంగూర కమురుకంపు రొయ్యపీచూ తోడులేదన్న ॥ఎ॥ చెరిగె సెనగపప్పు వుడికె వులవపప్పు, కండ్లెర్రజేసింది ,కందీపప్పు, ఈమూడుజాతులు కలుసుకొని వ్రూడబొడిచిన పెసరపప్పు కమురుకంపు నేతిబొట్టు తోడులేదన్నా ॥ఎ॥

కామిక్ — ఆడషోకు.

ఇండియా స్త్రీలచరిత మింపుగానేవింపుడీ యింపుగానాలింపుడీ సొంపుమీర షోకులన్ ॥ఇ॥ లోవర్ సెకండరీగాలో నెక్కుబుట్టెగా, సెకండ్రీ గ్రేడువలెస్కూల్ నెక్కుబుట్టెగా ॥ఇ॥ రౌండు నెక్ నెక్ అండ్ నో నెక్ రవికలంతరింపగానె రంగుజాకెట్లబ్బెగా, నారచీరలంతరింప నాణ్యమైన సిల్కులబ్బె, ఫేస్ పౌడరంటువచ్చి మోసగించె వనుపునెంలో కాసుదండలన్నితగ్గి మోసమైన చైనులొచ్చె ॥ఇ॥ కేసులట జోడింట దోసకాయపాంజేబులట, వాసన తలనూనెలంట టూకు టీకు షోకులట ॥ఇ॥

కామిక్ — మగషోకు.

మగవారిషోకుదెల్ప మనకేవిచిత్రముగా । మగవారిషోకుకూడ మనకే ఆనందమేగా ॥మ॥ పంచెలంతరింపకుండ పంట్లాలువచ్చెమనకు । నూట్లుబూట్లుహేట్లుకాగ షోకులెక్కువాయెమనకు ॥మ॥ చక్కని మీసాలుపోయి సగముమీసాలొచ్చెమనకు । సగముమీసమంతరించె షాపుక్షౌరమొచ్చెమనకు ॥మ॥ ఓపన్ కాలర్లురాగ వదులుచొక్కాలొచ్చెమనకు । రకరకాలు కాలర్లురాగ లంగుచొక్కాలొచ్చెమనకు ॥మ॥ బెంగాలు క్రాపులంట రంగూను క్రాపులంట ఎగదువ్వుడుక్రాపులంట ఎదురుబోడిక్రాపులంట ॥మ॥ కండ్లు బాగయుండగానె కండ్లకద్దాలొచ్చెమనకు । యిండ్లలోను యుండకుండ ముండలపాలగుదురహహా ॥మ॥

కామిక్ — పద్యము.

సీ. ఎ బి సి డీలు యెక్కువైనందున । వేదశాస్త్రములెల్ల యేటబడియె । సంసారులగు స్త్రీలు సానులైనందున । వేశ్యల కన్నంబు వెలితికలిగె

ఎం ఏలు బియ్యేలు యెక్కువైనందున । లోవర్ సెకండ్రీలకు లోటుకలిగె జర్మనుసిల్వరు జన్మించినందున । వెండిబంగారంబు ముండమోసె

గీ. బొంబాయిజగమందు ముత్యములుగనులు చేరె । కల్లనిజమాయె సత్యంబు చెల్లదాయె । తల్లివిషమాయె పెండ్లాము బెల్లమాయె । అహహా యీకలియుగమాయ యింకెంతొగలదొ.

బేహాగ్ — ఆది.

ఇయ్యాలకి తెలసింది బాబయో బంట్రోతు సాతానాకు ॥ఇ॥ ఫట్టి నేను యీబంట్రోతోళ్ళకు బుట్టలమ్మి ఇచ్చానుకానని । నను పట్టుకోని నను కట్టుకోని । నను నెట్టుకొచ్చారుబాబయ ॥ఇ॥ తట్టలోనె యాపట్టెడు మెతుకులు పొట్టనిండ తినకుండా । నను కొట్టుకోని నను పట్టుకోని తిట్టి తీసుకొచ్చారుబాబయ ॥ఇ॥

## సంగీతవిద్వాన్, అద్దంకి శ్రీరామమూర్తిగారు, బెజవాడ.

ఆఠాణా.

ఏల నీదయరాదు? పరాకుచేసెదవేల? సమయముగాదు? బాల! కనకమయచేల! సుజనపరిపాల శ్రీరమాలోల! విధృతశరజాల! శుభదకరుణాలవాల! ఘనపాల! నవ్యవనమాలికాభరణ ॥ఏ॥ రారా దేవాదిదేవ రారామహానుభావ రారా। రాజీవనేత్రా రఘువరపుత్రా । సారతరసుధాపూరహృదయపరివారజలధి గంభీర । దనుజసంహార! దశరథకుమార! బుధజనవిహార! సకలశ్రుతిసార! నాదుపై ॥ఏ॥

కల్యాణి.

చెలగుమాసె నేమిసేతురా దరిచేరనైన వీలుగాదురా । కోలుమాలిన దైవమక్కట నెలకుసరిగ మూడునాళ్ళు। చెలితనము చూడరాదు ॥చె॥ మరి పెమగల మొదటిరతిలో ముచ్చటైన దీరలేదు । మరియొకతరి గూడుదుమని మురియుచుండ నింతలోనె । మృదులహృదయు నౌపురీశ మదినిచింత యింతగాదు । మరిచెద రెండ్నాళ్ళకు నీ ముదముతీర కలియుదాన ॥చె॥

## యెంకిపాటలు, 1, 2, 3, 4 భాగములు.

జాము రేతిరియేల జడు గిడుపుమాని । సెట్టుపుట్టాదాటి సేనులో సేనుంటె । మెల్లంగవస్తాది నాయెంకి । సల్లంగవస్తాది నాయెంకి । పచ్చన్ని చేలోకి పండువెన్నెట్లోన । నీలిచీరాగట్టి సీటుగొస్తావుంటె । వొయ్యార మొల్కించు నాయెంకి । వునలచ్చిమనిపించు నాయెంకి । యెంకివస్తాదాని యెదురూగనేబోయి గట్టుమీదాదాని కంటికాపడగానె కాలుకదపాలేదు నాయెంకి । కరిగినీరౌతాది నాయెంకి ॥జా॥

మాటలన్నీ చెప్పి మంచెకిందాకెళ్ళి । గోనెపట్టాయేసి గొంగలీపయ నేసి । కూలాసగుంటాది నాయెంకి । కులుకుసూపెడతాది నాయెంకి యేత మెత్తెకాడ యెదురూగకూకుండి । మల్లీయెప్పటల్లె తెల్లారబోతుంటే సెందురిన్నితిట్టు నాయెంకి సూరియన్నితిట్టు నాయెంకి॥

### వైదిక సరసం.

పూబోణీనాతో మాట్లాడితే చేడైననిత్తు మాటాడకుండగా ॥పూ॥
బోటినాతోగూర్చి మాటాడ సాగుసెడ
వాటముగా దొరకినట్టి నీటి కానులిచ్చివైతు ॥పూ॥
మద్దరాలు నన్నుగూడి ముద్దునొకటిమ్మచో
తద్దినపు గారెలన్ని శ్రద్ధతోడ తెచ్చిపెడుదు ॥పూ॥
పొడుము పట్టువంటి ముద్దునొకటిమ్మచో
పొడుముమానికూడబెట్టి మడుపులు నేనిచ్చెద ॥పూ॥
గారివంటియొడలురుచు లూరజేయుచుండి సతము
తీరగదరి జేరనిచ్చిన చేరి కాళ్ళయినాబడుదు ॥పూ॥

### గోంగూర పాట.

నేనెంగుకెళ్లీయుంటి గోంగూరకి తోడునీడలేకుండ గోంగూరకి..
అయ్యో తోటలోనికడితినే గోంగూరకి
ఘోర పాపిష్టి నాకొడుక గోంగూరకి

కంచెకాడచూచినాడు కన్నుయిట్టె గీటినాడు
పొంచునుండి నాకేసీ పొడుగుమీసం దువ్వినాడు
మంచిమాటలెన్నో యాడి మంచెపైకివచ్చుచో
మంచిముద్దు లిస్తానని గోంగూరకీ
నన్ను వంచించబోయినాడె గోంగూరకీ
ఓలె పంచజూపి నవ్వినాడె గోంగూరకీ
కొంటిమూండానాకొడుకెగోంగూరకీ
యీలసీటికొట్టినాడు యిట్టెసెంతజేరినాడు
గట్టిగాను పట్టినాడు కంగారుబెట్టినాడు
కడకేంటొసెప్పినాడు గోంగూరకీ కైలాసమన్నాడె గోంగూరకీ
పట్టిపట్టిలాగినాడె గోంగూరకీ
ఔర భడవముండా నాకొడుకె గోంగూరకీ॥
పైకిపైకివచ్చినాడూ పండ్లుయికిలించినాడు
నీకునాకు జోడన్నాడు నిన్నుమెచ్చితినన్నాడు
ఉన్నదెల్లనిచ్చిపైతు నూరకుండుమన్నాడు
మీదచెయ్యివేసినాడు గోంగూరకీ అమీద
ముద్దులన్నాడె గోంగూరకీ అయ్యోమాయిదారి
నాకొడుకె గోంగూరకీ॥
ఎన్నిసెప్పుకొన్న నేసెంతవేడుకొన్న.
నుంతయైనవినక దావంతమూనిచెంతసేరి
కాంత కౌగిలించి సంతసంబునాకునిచ్చి
యాదరింపుమనుచు నట్టుయిట్టుతిప్పితిప్పి
యెన్నొగంతులు వేసినాడె గోంగూరకీ
నన్నేడిపించి విడిచినాడె గోంగూరకీ
కన్నగాడి నాకొడుకు గోంగూరకీ॥

## కుండ పాట.

కుండఖరీదియ్యరా నామగడ కుండఖరీదియ్యరా
కుండఖరీదియ్యకుండ గుమ్మమింక దాటనియ్య ||కుండ||
కుండంటెకుండకాదు రాయివంటి కొత్తకుండ
ముద్దులొలుకు కొత్తకుండ చేతికిరువైనకుండ
నల్లానిరంగుకుండ చక్కనైన చుక్కకుండ
చంకనొదిగియుండు సాటిలేనట్టికుండ
సరసమైనట్టికుండ సొంపైనగట్టికుండ
కుండంటె కుండగాదురో నామగడ ||కుండ||
కావిరంగుచీరగట్టి కాళ్లామట్టెలుబెట్టి
కొంగుజీరాడగట్టి నుదుట చుక్కానుబెట్టి
పుక్కిట తమ్మిబెట్టి కుండాబుజానబెట్టి
రొంటచెయ్యనుబెట్టి రొంబట్టు రైకతొడిగి
వీధిపైపు నీరుదెచ్చు విలువైన నాకుండ
కుండంటె కుండగాదురా బాపడా ||కుండ||
కుండంటె కుండగాదు గున్నవంటి కొత్తకుండ
పదునైన బంకమట్టి మంచిమంచిపాళ్ళువేసి
హంసశెట్టి వీరయ్య పట్టిపట్టి నొక్కినొక్కి
దిట్టముగాజేసినట్టి దొంతంశెట్టి పుల్లమ్మెంతో
మెట్టిమెట్టి చేతపట్టిచూచిచూచి దిట్టమైనట్టికుండ
నామగడ కుండంటె కుండకాదురో నామగడ కుండఖరీదియ్యరా॥

## రంగమెల్లిపోదామె పాట.

రంగమెల్లిపోదాము నారాయణమ్మ రంగురంగులమేడలోన నా...
పొంగుచునుందాని నారాయణమ్మ చెంగునలేచిరాయే నారా...
కులుకుగుబ్బలునూసి నారాయణమ్మ వలచిపిల్చితినిన్ను నారా...

మరిమరివేడితిని నారాయణమ్మ సరిలేనె నీతోడ నారా...
సంతోషమాతుంది నారాయణమ్మ నసరకొచ్చెయ్యింక నారా...
మోటారుబండెక్కి నారాయణమ్మ వాతముగ దిరుగుదాము నా...
నాటకాలకెల్దాము నారాయణమ్మ బూటకాలియికావు నారా...
నీయిష్టమొచ్చినట్లు నారాయణమ్మ నేనెప్పుడుంటాను నారా...
నీకంతొసుఖమిస్తు నారాయణమ్మ నీకెన్నొవస్తువులు నారా...
చేయించియిస్తాను నారాయణమ్మ నాయందు దయయుంచి నా...
శుక్రవారంనాడు నారాయణమ్మ బయలెల్లు ఓడలోన నారా...
పోదారితయారుగుండు నారాయణమ్మ నీవెపుడు నూడనట్టి నారా...
సోకులెన్నొ చూపుతాను నారాయణమ్మ అందమైన సీరలెన్నొ నారా॥
అందునీకు కొనిపెడుతు నారాయణమ్మ నీయిష్టమేలాగొ నారా...
యెంటనేకబురంపు నారాయణమ్మ

## పొ డుం కా య పా ట.

యదుకులకాంభోజి — ఏక.

ప॥ పోయెనాపొడుముకాయ బంగారుపొడుంకాయ
అ॥ ప॥ ముద్దయినపొడుంకాయ మురిపెంపుపొడుంకాయ ॥పోయె॥
చ॥ రంగైనపొడుంకాయ పాణిమొనగుపొడుంకాయ
భంగపెట్టి నన్నునిచట బాసినీటజారిపడి ॥పోయె॥
2. చేతి కీరవైనకాయ చిన్నెవన్నె లలరుకాయ
ఖ్యాతిగూర్చగలకాయ కడకుజారి నీటబడె ॥పోయె॥
3. వింతవింతగొలునుతోడ వింతవింతహొయలుగలిగి
సంతతంబు మదికినెంతొ సంతసంబుగూర్చుకాయ ॥పోయె॥
4. తిండిలేకబ్రతుకవచ్చు సిగ్గులేకబ్రతుకవచ్చు
పొడుములేకబ్రతుకుట బ్రహ్మదేవునికైన తరముగాదు ॥పోయె॥

మరట్—కపాలీ.

పరమేశ్వరు సేవా మహిమా గనువారీ మహిలోఏరీ ॥ప॥
హరుసేవాపరులేరికిగాని ఆపదలేవియురావు
దేవదేవ కరుణారసభరితా కావగరావ సుచరితా
శ్రితజనులను బోషింపభారమా శ్రీకరసేవకపాలనా ॥శ్రి॥
దేవాగతినీవే యీశ్వరా దయరాదా దయరాదా దీనజనావనా ॥శ్రి॥

ఫీల్—తిశ్రగతి.

చిక్కేవోహో చిక్కేవోహో చక్కనిచుక్క
నామక్కువతీర్పవె నీదు చెక్కిలినొక్క ॥చిక్కే॥
ఏలుకోగదె బాలికామణి తాళజాలనె రావెరావె
భామ వలపుల రాచిలుకా ॥ఏలు॥
చిక్కేవోహో చిక్కేవోహో చక్కనిచుక్క
వాడిక్కడికికరాడే। నీమక్కువతోడే ॥చిక్కే॥

మిశ్రభూపే—ఏకా.

మాయదారి మాటలకే మోసపోతి పోపోర
నీకాడ నిలునుంటే నిలువెల్ల నీరాయె
నీతో రాతిరంత రాతిమీద కూకుంటి ॥మా॥
నీతోడోలమ్మి। నిన్నిడిసిపోనె అన్నావా
రంగైనచీర తెచ్చి పెడతానే అన్నావా
సరిసరి నీమాయలేలరా ॥మా॥

ఫీల్ మిశ్ర—త్రితాల్.

నాతరమా దేవా ఆ ఆ ఆ శంకరా వరదాత నేతా ॥నా॥
నీసేవా మహిమా గనగా పరిపరివిధముల నేగొనియాడగ ॥నా॥

సారంగ్—త్రితాల్.

ఓం హరహరహరశంభో ॥ఓం॥
రేపోమాపో మరణమురాదా
భయపడకే పరుగిడకే మనసా ॥ఓం॥

### నారాజుపాట.

నన్నిడిసిపెట్టెల్లినాడే నారాజు మొన్నతిరిగొస్తనన్నాడే । నీలుతే బోతుంటె నీతోడెవోలమ్మ । నాయెంటయెవరోను నడిసినట్టుంటాదె ॥న॥ అద్దములోసూత్తుంటె అదియేటో సిగ్గమ్మ నాయెనక యెవరోను నవ్వినట్టుంట-రు ॥న॥ సల్లన్నియెన్నిట్లొ సాపేసికూర్చుంటె ఒట్టమ్మొఒల్లంత ఉలికులికి పడతాదె ॥న॥ నీతైనవోడె నారాతెట్టగుంటాదొ కళ్ళళ్ళోసత్తెముగ గట్టినట్టుంటాడె ॥న॥

### యెంకిపిల్లపాట.

యెంకివొంటిపిల్ల లేదోయి లేదోయి యెంకి నావొంకింక రాదోయి రాదోయి మెళ్ళొ పూసలపేరు తల్లో పూవులపేరు కళ్ళెత్తితేసాలు కనకాబినేకాలు ॥యెంకి॥ సెక్కిటసిన్నిమచ్చ సెడితేసాలుదులచ్చ । వొక్కనవ్వేయేలు వొజ్జిరవొయిడూరాలు ॥యెంకి॥

పదమూపాడిందంటె పాపాలుపోపాల । కతలూసెప్పిందంటె కలకాలముండాల ॥యెం॥ తోటంతాసీకట్టె దొడ్డీసీకటిమయమే । కూటికెళితే గుండె గుబగుబమంటాబయమె ॥యెంకి॥ రాచోరింటికైన రంగుతెచ్చేపిల్ల నాసొమ్ము నాగుంటె నమిలిమింగినపిల్ల ॥యెంకి॥

యెంకివస్తాదాని యెదురుతెన్నులుకాసి । దిగులెట్టి తలదించి తిరిగి నూసేసరికి । యెంకిరావాలి నాయెదరనిలవాలి । గులుకుతూ నన్నేటొ పలకరించాలి । పిల్లపోరుగూరెల్లి మల్లిరాలేదాని । వొల్లంత వుడుకెత్తి వొక్కన్ని పడుకుంటె ఘల్లుమంటాయెంకి కాలుపెట్టాలి । యెల్లివొచ్చానంటు యెంకినవ్వాలి । యెంకికోపాలొచ్చి యేదేశమోపోయి కల్లొ నాకాపడితె కళ్ళుతెరిసేసరికి । తళుకుమని యెంకినాదరికి రావాలి । నిదరకాకోసంటు నిందలాడాలి ॥యెంకి॥

### ఫేల్ మిశ్రి — త్రితాల్.

హరినే స్మరియింపుమా శ్రీ ॥హరి మనసాసదా హరినే ॥స్మ॥
శ్రితజనఘన - పరిపోషణమే - శిరమునదాల్చిన శ్రీమురారీ ॥మ॥ ॥స్మ॥

మాండు.

వరనారీమణులెంతో యొయ్యారముగ వనీజేరి ॥వ॥ నడకులుల్కుతోడ నునుపల్కుతోడ కనుబెల్కుతోడ తోచిరహహా । ఆశ్రిమంబుననున్న యాయతివజనము లలితమూర్తి శుద్ధాంతదుర్లభము । చూచె జానుగా ఎందులేని వుద్యానలతల వనలతలుమించవే । గుణగణము ॥వ॥ నడకులుల్కుతోడ నును పల్కుతోడ కనుబెల్కుతోడ తోచిరహహా ॥వ॥

అష్టపది — జంపె.

మంజులతర కుంజతర కేళిసదనే ప్రవిశ నాథే మాధవ సమీప నిలయ ఇహవిల సలబిరదస హసితవదనె ॥మం॥ నవభవశోకదళ శయనసారే ఇహవిల సముచకల సతరణహారే ॥మం॥ మధుముదిత మధుపకుల కలితరారే ఇహవిల కుసుమశర సరసభానె । విహితపద్మావతిసుఖసమాజె కవితజయదేవ నాకవిత రారె ప్రశ । మాధవసమీపవిహ ॥మం॥

టి. పి. కైలాసంగారు, బి. ఏ. ఎల్. టి. లండన్.

వింతపాట.

ఆకులమ్మెలచ్చిమి చిగురాకులమ్మె లచ్చిమి । అకులమ్మిన రూకలన్నియు యేమిచేస్తివిలచ్చిమి। యెగలచ్చిమి దిగలచ్చిమి భగలచ్చిమి,కోడినిస్తానంటివి కోడిపిల్లనిస్తానంటివి । కోడికానక కాలరూపై కల్లుకిచ్చెదనంటివె । మిద్దెమీదనిద్దురల్ పైనమీద నిద్దరల్ । మిద్దెమీద లచ్చిమియుంటె యెటువచ్చును నిద్దురా ॥ఆ॥

కామిక్.

రారానాహుందకాడా రారానాహుంసులాలాసైసై । రారానాహుందకాడా సైసై రారానాపోలుకాడా । రేపల్లివాడాను మాపిడికిపయిన మే నేరానుచూడుబొమ్మా । నేను కొత్తచీరగట్టుకొని నాసరువురవిక । దెచ్చుకొని నీగోడాలకంతకిందకాడా వస్తార । నేరానుచూడుబొమ్మా ॥రా॥ రారానాజోడుకాడా సైసై రారానాహుందకాడా । నీవ్రసిపాయి కొడుకైన సిపాయికడుపునిచ్చిపో । నేరానుచూడుబొమ్మా ॥రా॥

## కొచ్చర్లకోట రంగారావుగారు.

కామిక్.

ఈనోళ్ళు పట్టుకునేవాళ్ళు ఈరంగణ్ణి పట్టుకునేవాళ్ళు । పాండి రంగణ్ణి పట్టుకునేవాళ్లు ఈయూరనున్న మొగోళ్ళు బాపురే కపీకపీ లప్కి లపీ ॥ఈ॥ వలపులరంగడా, మల్లెపూలరంగడా, రంగడంటేరంగడా, తాగుబోతురంగడా, కొచ్చర్లకోట రంగడా ॥ఈ॥

కామిక్.

ఎల్లినాతో గద్దె ఎక్కుంటని । జాజిమల్లితోటి గద్దెమానుంటని ॥ఎ॥ పేరయ్యారాజంట పేకెల్లినాడంట । తనమామవాళ్ళు దండాలెడ్తారంట ॥ఎ॥ సందట్లో సమయము నూస్తారా । సుపడ అందుట్లో సరసాములాడ్తా నురాదేవ ॥ఎ॥

పాట.

రైతుపైని అనురాగము జూపని రాజులుండగా నేలా
రైతులేందే రాజ్యములేదను నీతిని యొంచరదేలా ॥రై॥
పంటబోయినా పన్నులదెమ్మని బాధల బెట్టెదరేరా
కూడుగుడ్డలకె కుందెడురైతుల కొంపలగూల్చెదరేలా ॥రై॥
ఓటుయిమ్మనీ కోటనురమ్మని ఒత్తిడిజేయగనేలా
మాటిమాటికి అప్పులబాధల మాడ్చిచంపగానేలా ॥రై॥

మాల్కోస్.

జగన్మోహనాకార శ్యామసుందరశరీర । నాగారి ముఖసురనుత చరణా భవహరణా । శుభగుణ ఖగవాహన సుజనవినుత । కవిజనాళిపోషణతి ॥జగన్మోహన॥

యమన్.

గురుకృపాంజన పాయో మోరెభాయీ । రామబినాకత నూచత నాహీ ॥గు॥ జాగ్రతరామా సోవత్ రామా స్వప్నమే దేఖుసీతారామా ॥గు॥ అందరెరామ బాహెరెరామా । జహాదేఖో నాహోరామైరామా ॥గు॥

## పొగాకు పాట.

పల్లవి॥ పొగాకుబిల్లండి బాబూ । మాపుట్టిమునిగిపోయె పూనీరక్షించండి॥

చర॥ భరతదేశమునందు భారతీయులంత భాగ్యముగ జూచేపొగాకు । పొట్టచేతబట్టి పొద్దస్తమానాము పోరూపొందూగూడ లేక । భార్యాబిడ్డలవీడి బండచాకిరిచేస్సి పండించే మాపాలిధనము । పరదేశవాసులు పలువిధంబులుగాను పానంబుచేసేపొగాకు । మాపాడిపంటాలాను మానాభిమానాల మంటకలిపెడిబిల్లు బాబూ ॥పొ॥

చేగర్లుచేబూని చిన్నాపెద్దాకల్లా చేతిలోపొగచుట్ట లేక । చెంత పోరమొక్కటియుండబోక । దానిపక్కనాకు లేకయుండ । పదునూ వేసికాల్చు పదిలాపరచుకొనక చేలోకిపోరండి బాబూ॥

చూడచుట్టములొస్తె చుట్టాలివ్వకపోతే మర్యాద పోనండి మాకు । అధికారులెవరైన హజూమాయిషీకొస్తె పొగచుట్టె ముందుపెట్టాలి । సొగసైన పొగచుట్ట షోకూరూపుమాపు పొగాకుబిల్లండి బాబూ॥

నీటీపల్లడిమాన్పి సాటీలేదనిపించు ఘనమైన పొగాకుచుట్ట । పళ్ళాసలుపూదీర్చి పలుకూబడినార్జించు ఘనమైన పొగాకుచుట్ట । చలికాలమున వేడి చల్లాగదయచేసి సమదాయించునండి మమ్ము । దేహబాధనుదీర్చు సాహసంపుమందు శాహోటముగ చుట్టేనండి । మాబాధలనురేపించి మానాలు హరియించు మాపాలిదయ్యా మీబిల్లు॥

తంబాకుకేకున్న తబ్బిబ్బుచెందేటి దాశాలు కొందరున్నారు । అజీర్తిబాధచే ఆకలిపుట్టుటకును ఆదరింతురి కొంతమంది । జలుబు శ్లేష్మాలకు అన్నిరోగాలకు జాగ్రత్తపరచే వారుంకిరి । దగ్గూఉబ్బసములను తగ్గించుకొఅకుగా గగ్గోలునొందు వారుండిరి॥

ముక్కుపొడుమునుపీల్చి మిక్కిలిగసుఖియించు ముక్కోటి వనిజకెల్ల బాబూ । దిక్కులేకనువారు దీనాతిదీనముగ దేవురుజెందుదురండి బాబూ । మాప్రాణాలరక్షించి మానాలకాపాడి మాన్యముగ నుండేపొగాకు । చుట్ట మంటూపెట్టి పట్టిపల్లార్చేటి కట్టడిబిల్లండి బాబూ॥

ఆంగ్లదేశములోన ఆబ్కారీపానాలు ఆరోగ్యధర్మాలు బాబూ । మా దేశపొగచుట్ట మహనీయులకు గూడ దేహారోగ్యముకొఱకు బాబూ । మా పనిబట్టి పసదీసి పట్టిపల్లార్చేటి పొగాకుబిల్లండిబాబూ॥

కంటాకుమించిన పన్నులుబాధింప కొంపాగోళ్ళుపోయినాయి । పస్తులబడియుండి శిస్తూలుగట్టంగ పుస్తెపూస నమ్మినాము । పొగాకునకుగూడ తగనీపన్నూ వేస్తె భగభగమండీపోతాము । లైసన్సంటో బెట్టి మా లైఫ్ల్ దిగమ్రింగేటి మాయాపొగాకుబిల్లండీ॥

ఋణనివారణచట్ట మనివార్యముగమాకు ఋణమూ పుట్టకుండజేసె । తలలెత్త లేకుండా తల్లాడమందుచు పెల్లుగనై పీల్చేట్టాము । లాభాల కాంసించి లంచాలతడికైన లైసన్సు పెట్టాబోకండి । పంట పాడైపోయి పాడీ మండీపోయి ధరలన్నీ దగ్ధమైనాయి । మారక్తంబు తెగపీల్చి భుక్తను దిగలాగేసి ఘస్తుగజంపేటి పొగాకు॥

వంగదేశీయులు హుక్కా లేకపోతె వక్కానిముష ముండలేరు । ద్రవిడమలబారులు తంబాకులేకుండ తాళంగ లేరొక్కఘడియ । మహమ్మదీయులు బీడీలేకపోతె బిరబిరదిమ్మైపోతారు । హిందువులందరూ దండడి చెందూతారు పొగచుట్ట పొడుమూనులేక । మానోరూ ముక్కూగట్టి మాప జేసెడిమాయ మహమ్మారిబిల్లండిబాబూ॥

ప్రజలాసమ్మతిపైని ప్రతీనిధులై మీరలు పన్నూలువేయుట న్యాయం । పదవూ లస్థిరమూలు పాపాలెనిలబడును పరోపకారమే ధర్మం । చుట్టముక్క కొఱకు పట్టుబట్టక వేగ చట్టమురద్దుపరచండి.

ప్రజలాకష్టములెరిగి పాలానసేయక పన్నూలభారంబుపెట్టి । రైతును కుంగదీసి బైతునుజేసేసి పాతివేయుట పాపమండి । ముందువెనుకలుజూచి పదిమందినుఖియించు సంధానుతొక్కండి బాబూ । నోరూ ముక్కు గట్టి ఘారాను కాపుంచి కారాలుమిరియాలు నూరి । మాకొంపలుకూలదీసి చెంపలు వాయగొట్టి దుంపదెంపేబిల్లుబాబూ॥

## తత్వము.

రైతుకేఓటివ్వవలెనన్నా నీకష్టసుఖముల
రైతుప్రతినిధి తీర్చగలడన్నా రైతునని వోట్లసిగితీసుక
రైతుకొంపలు గూల్చుపట్లను నీతిగాదను జ్ఞానమున నిక
గోతిలో బడద్రోయకుండే ॥రైతు॥

2. దారిడొంకలు లేనియూళ్ళన్నా మన పల్లెకొంపలు
దమ్మిడీకి పనికిరావన్నా దారిడొంకలులేక ధాన్యపు
ధరలు తగ్గియు పంటపాడై తేరికొనుట కశక్తుడగు
నాదారు రైతుకు తెన్నుజూపే ॥రై॥

3. శిస్తుభారము చాల హెచ్చమ్మా!
పంటెల్ల ఊడ్చిన శిస్తుకైనను చాలదోయమ్మా!
శిస్తుభారము హెచ్చె రైతుల చిక్కులెల్లను మిన్నుముట్టే
కస్తి హెచ్చెను ద్రవ్యమునకీ కష్టముల దీర్చెటి యోగ్యుడు ॥రై॥

4 ఓటువిలువను తెలుసుకోరన్నా!
ఒకపూట తిండికై ఓటునిచ్చుట సిగ్గుచేటన్నా!
ఓటుతోనే ముందుస్వేచ్ఛా కోటపట్టగవలసియున్నది
నేటికైనను నిదురమేల్కొని దాటిస్వార్థము పౌరుషముతో ॥రై॥

5. ముందుకాలము రైతుదేవన్నా!
నిగురించకను నీవందుపాల్గొన సిద్ధపడుమన్నా!
ముందుకాలములోన నీవానందపడగల రేఖలున్నవి
కందువది తెలతెల్లవారక ముందెస్థానము నాక్రమింపగ ॥రై॥

6. పాలనము నీ చేతిలోదన్నా!
నీవెన్నుకొన్న ప్రతినిధియె పెత్తనదారన్నా!
పాలనంబున కెవడుయోగ్యుడో ప్రథమమున యోచింపకుండిన
పాలనముచెడిపోగ యిప్పటి పాలనమె మేలందురిగావున ॥రై॥

7. కలముతో మనకేమిబోలమ్మా!
కష్టించిదున్నే కులముసంగతి తెలిసికొనుడమ్మా!
కులపుకక్షలుకొట్టి మనలో కలహముల రగుల్చింపజేసి
బలము సంపాదింపనెంచెడి తులువతనమును వీడి మనేనున
రామరెడ్డికె ఓటునివ్వమ్మా!
నీకష్టసుఖముల రామిరెడ్డే తీర్చగలడన్నా! ॥రై॥

## కీర్తన.

నిద్రిమేల్కొనర తమ్ముడా గాఢనిద్రి మేల్కొనర తమ్ముడా,
నిద్రిమేల్కొని భద్రిపడగ ఓజమీందారీ రైతు తమ్ముడా ॥ని॥
కారుచీకటులు విచ్చెరా మంచుకణములన్ని యింకిపోయెరా
తూర్పుకనుమలోననదె చూడరా స్వాతంత్ర్యభాను డుదయించెరా
ఇంక తడయనేల లెమ్ములెమ్మరా నిద్రమేల్కొనర తమ్ముడా॥
స్వాతంత్ర్యమునకు చూడరా జాతిజాతి కుర్రిమ్ములాడుచుండెరా
స్వేచ్ఛకొరకు చూచుచున్నారురా నీవిపుడె కండ్లుదెరవకున్నరా
నీకెన్నటికిని ముక్తి లేదురా నిద్రిమేల్కొనర తమ్ముడా॥
రాజ్యమునకు రైతు గుండెరా సామ్రాజ్యమునకు రైతురక్షరా
అట్టి రైతె మేడి బట్టకున్నర్యా యీరాజ్యమంత పూజ్యంబురా
యీరహస్యంబు గనబోరురా నిద్రిమేల్కొనర తమ్ముడా॥
స్వార్థపరత్వము మీరెరా పాపభీతితన మనలె లేదురా
రైతుపైన జాలిబండినున్నరా యీజమీందారి పద్ధతంతెరా
నీను సౌఖ్యమేమి లేకుండెరా నిద్రిమేల్కొనర తమ్ముడా॥
ఏరువాక వచ్చిందిరా దుక్కిటెద్దు రంకె వేసిందిరా
తొలకరింపు పులకరించిందిరా నిండు పూర్ణిమంబు పుష్పించెరా
నీ భూదేవిని పూజసల్పరా నిద్రిమేల్కొనర తమ్ముడా॥

## కామిక్.

సై సై చెన్నాపారెడ్డీ నీపేరే బంగారాపారెడ్డీ సైసై......
రావుగల్గినా రైతునాయకుడు పౌరుషంబుగల వీరాగ్రణాలి
అంతులేని అభిమానవంతుడు ఆడితప్పనీ సత్యసంధుడు
ఆత్మగౌరవం పోతుందంటే ప్రాణింబిడ్డే మానవంతుడు
మిన్నువిరిగి పైబడ్డాగాని చలింపనట్టి సర్దారయ్యా చెన్నపరెడ్డి॥
చెన్నపరెడ్డి పేరుచెప్పితే పసిపిల్లలే పాలుదాగరు
పౌజుదారులే గడగడవణకు విరోధులంతా విలవిలవన్నక
చెట్టుపుట్టల్లా చేరెదరండి కొండవీడి సీమకెల్లను
గుండెకాయగా ఉన్నాడండి చెన్నప్పరెడ్డీ - సై సై॥
బానిసత్వమునకు లొంగిపోవడు పరులకెప్పుడు తలవంచి తిరుగడు
స్వాతంత్ర్యంబును కోలుపోనడు స్వలాభానికై ప్రయత్నింపడు
దేశమంటె పడిచస్తాడండి వాసిబోకనె బ్రతుకును రెడ్డి ॥సైసై॥
కష్టమొచ్చినా కలతజెందక నష్టమొచ్చినా దిగులుబొందక
పిరికితనము దరిజేరనివ్వక బెదరింపులకును లక్ష్యపెట్టక
పేరుమోగినా పెద్దకాపుగా పెత్తనంబు జేస్తున్నాడు ॥రెడ్డి సైసై॥

## కీ॥ శే॥ ఆంధ్రగంధర్వ జొన్నవిత్తుల శేషగిరిరావుగారు.

### మోహన.

భక్తమణికిని బంధముకోలగెక ॥భ॥ బ్రహ్మానందమహా ॥భ॥ పతినై సక్కనను భ్రమపెట్టితిగా । సతినై పతితో సరసములాడెద చతురత మెరయగనా ఆఆ౩ఆ ॥భ॥

### భైరవి.

రేపువత్తువుగాని తూరుపుతెల్లవారె । పోరా యీవేళకు ॥రే॥ నా పతిలాచిన రాపీడిచేయును । కాలంబు నేడూ కడగండ్లపాలవుదు । తోవ

మూనక నావయిని పరితాపభారము నాపరా । ఏపుమీర నుఖంబొసంగెద నాపురి గోపాలబాల ॥రేపు॥

కలకలరవములై ఖగములెగయజొచ్చె నలుగూరు యిటునటూ నడయాడువేళాయె । చెల్వుడా యిక వెడలమన్నను చిక్కులకు లోనగుదు మకటా పిలువనంపెద నిక్కముగ ॥ పెనగులాడకు పుణ్యమాయె ॥రే॥ మనను యిసుమంతా మరలింపవలెగాని మన కోరికలకింకా మరి మేర కలదె ఎనసి సమరతులందుముచ్చట తెల్లయనుభవించితిమిగద । ఒనరగా పురుషా యితంబది ఒక్కటేగద తక్కువాయెను ॥రే॥

పాట.

వాయింపుమా మురళి వాయింపు కృష్ణా!
తుమ్మెదగండ్లూ ఝుంఝుమ్మనిపాడు
శారదరమణియూ సందర్శింపురాజు
ఆనందమున నోలలాడుచున్నారు
వాయింపుమా మురళి వాయింపు కృష్ణా!
పండ్లుపైరులు మిగుల పండియున్నవనె
రతిరాజు లోక సామ్రాజ్యమ్ము నేలు
ఈ వేళ చింతలను ఎడమేడదోయి
స్వచ్ఛమ్ముగా మురళీ నాయింపు కృష్ణా!
వాయింపుమా మురళి వాయింపు కృష్ణా!

పాట.

రాబోకు రాబోకురా చందమామ! రాహు పొంచున్నాడు రాత్రోవలోన
ఆకొక్కటైనాను అల్లాడకున్నాది మబ్బుల్లపైనేవొ మాయకప్పేసింది॥
తెల్లన్ని నీకాంతి నల్లనయ్యేనురా! చల్లన్ని నీమోము సన్నగిల్లేనురా॥
పరమరాకాసిరా పాపిష్టి రాహువు ఏత్తిలా నినుబట్టిమ్రింగ
బొయ్యేనురా రాబోకురా రాబోకురా రాబోకురా॥

## పాట.

1. రావోయీ వనమాలీ బిరబిర రావోయీ
నవనీతమె రుచో నామది రుచియో
చేతనుంచెదను చవిచూడుము రావోయీ...

2. తిప్పవారికి తిప్పలుబాపె పేదలపెన్నిధి రాటం మనమది
ఆరాటము ఓటమినూన్చే రైతుతల్లీ రాట్నమాతా...

3 పిల్లగాలికే రివ్వునఊగి జొంపల వంచెను పైరూ
తల్లి పొదుగులో జొదలదూర్చి పాలుతాగే లేగదూడా...

4. చిమ్మచీకటులు చిందినరేయీ మాయంబై తెలవారె
రైతుసంతతిని రాయిడిజేసి దయమాలిన ప్రభుతలు మానే
దీనపోషకుల తొలిమిమోసీ రవికాంతా జగతిని దాసే

5. రాజూ రాజ్యము లంకెలువేసే బంగరుపంకెలరైతూ
రైతులమనమూ రాచిననాడూ రాజూ లేడూ రాజ్యము లేదూ

6. నీలిమబ్బులు నీళ్ళనుబోసీ తోటలు పైరులు పెంచూ
మేలిచెమ్మటలు కారిచివేసీ ఊరూ నాడూ పెంచురైతు॥

## పాట.

కన్నబిడ్డకై కలవలపడుమను కన్నె రాక్కుర్పునులేమి!
ఉన్నదానిలో ఓపినమట్టుకు ఒరులకు పెట్టుట లేవి!
చీకటివెలుగుల చిత్రములేమి జిలిబిలి అల్లిక చిక్కులు లేమి
కష్టసుఖంబుల కావడిలేమి మోదఖేదముల ముచ్చటలేమి॥

## కీర్తన.

ఇవ్వాళ్ళవలెకాదమ్మా! మువ్వగోపాలు
డెన్ని నేర్చినాడమ్మా!
నన్నుకన్నులుమూసీ నా చెంతనుండిన
సన్నుతాంగిమోవి చాలాచప్పరించె ॥ఇవ్వాళ్ళ॥

## పాట.

చలో సిపాహీ కరో సఫాయీ హక్ దకో ఝూడమా
జహాఁ కహీఁ హోకూడా కచరావహీంపడే ఝూడమా
సుబహశామకరతీ ఇస్‌కీపూజా మృగనైనీగోరీ
ఇసఖేజరాయీ కరతె సారానలామిాభరతె
చర్ ఖే కీనానీ ఝూడమా చలో.

## పాట.

రేలో రేలో రేలో సూకామేవా రేలో ధక్కాగాడీ బందరవాలీ
ఆనేదో ఆనేవాలీ రేలో॥
యొపిస్తే జోఖాయే హనుమాన్ హోజాయే
యొయిలాయిచీదానె రసియాఇన్ హేఁ బఖానె
కలకత్తేకాకాజూ తోవేటల్ తరాటా రేలో
పీరేళ రబత్ కో ఈ, కిమ్‌కా
భమసేనకో జీతకరే రేలో
ఖాతేహై మిర్చిమసాలె జో
హోజాతేకాట్ హవారేవో రేలో
బ్రహ్మచారికా సూకామేనా
లావో జోర కరో దేశసేవా (రేలో)

## పాట.

జమునాబీచ్ ఖేలూం ఖేల్ అకేలీ క్యా సాజనా
లసరేఁ హిలోరేఁ ఖాతీ పలమేఁ జవానీలాతీఁ దేఖోకైసే లులూతీ॥
క్యుం ఖడేహో మూఁ బిగారే శ్రీమనగంగాకె కినారె
పావసఘన బనకరప్యామ్ బరసనావహో సాజనా (జమునా)

## సి. యస్. ఆర్. ఆంజనేయులుగారు.

### మాండ్.

రఘుకులభూషణా రామ రఘుకులభూషణా। నీపదసేవనమే నాగతి యని తలంతుగా ॥ర॥ రామనామస్మరణామృతమును నే తనివితీర మనసార గ్రోలి ధన్యుడనైతిసుగా ॥ర॥

### కాంగడ - 1, 2 భాగములు.

హితనైవచోట నీహితవించెగాక నేఇంకాదునటరా నీకు ॥హి॥ నిత రానచూరామా మువ్వాగోపాల ముందుగా నామాటలూ ఓరామా ॥హి॥

ముచ్చటైనాఒక్క ముద్దుపెట్టెదనంటె మోమెరజేసితివో కృష్ణా వచ్చికేరగరాదు పలుకెంతో నుంచితే బాగాయెననుకొంటివో కృష్ణా ॥హి॥

ఇనుమంతసేపైన యిలుజొచ్చి పొమ్మంటె ఎంతైనగసిరితివో కృష్ణా రసికూడా గావింకా రాత్రినాల్గుఝాముల్ రమ్యాకృపజూపిస్తివో ఓరామా॥

### కాళింగడ.

రాధా యెంతకృశించితివో। మది ఎంతతపించితివో ॥రా॥ అంతరంగమున మద్వియోగానల। మలయుతాపమున దహియించెన్। శాంతిసుంతైనా లేదుగాన నీవెంతతపించితివో రాధా ॥ఎంత॥

### పాట.

సత్యముగానకజాలా నాధా ననుదయకను నాధా గోపాలా ॥స॥ అన్యముగామది భావింపకుమా। నిజముగనాకీ వేదన కలిగెన్। ననుదయగను నాధా గోపాల ॥సత్య॥

### భాగేశ్వరి.

యదునందన గోకులబాలా। గోపీహృదయ ఖేలతిలీలా ॥య॥ నీదగు మహిమల యేరనుదెలియన్। జాలరుగా లీలామనుజైనన్। హేమవసన నగరధీర ॥య॥

భాగేశ్వరి — పాట.

ఓమహోనిలయ మాధురీమాయా, ఉహ జయరామా మృదుభాషాతృష ॥ఓ॥ నీపదసేవా నిరతిలోలమై భావజగం బితుప్పావనలంబై ॥ఓ॥ విచలిత హృదయా మృదుభాషాతృష మానిపేమసరి మాన్పెడితరమా ॥ఓ॥

వల్లూరి జగన్నాధరావుగారు, కాకినాడ.

కామిక్ — కోడిపాట.

కోడీ నాకోడీ ఆహాకోడీ నాకోడీ । నేనోడిపోతె పోతెగాని నోట బెడ్డకొట్టుకొంటి ॥కో॥ నూజివీడు నుంచితెచ్చి రోజూ శేరు తౌడు బోసి మోజుతోనిను పెంచినానె గాజువన్నెగలముద్దు ॥కో॥ సంకురాత్రి పండగ నాడు సరుకుపూటు గేసుకోని । చంకనిన్ను బెట్టుకొని సంపకానుకొంటినె ॥కో॥ బొడ్డునున్న ముల్లైపోయె లడ్డువంటి కోడిపోయె । రొడ్డుపైన దొర్ల పోలీసు దుడ్డుపోటులాయెనాకు ॥కో॥ కాలుకదల నీయకుండ మేలుపుంజు లానుపొడిచి । చాలినంత కూరతెచ్చి సాకినావు మమ్ముల్లాను ॥కో॥ అంద మైనఅరు । నీకిరిందచూపులతీరు । పందలాడి బొడిచిన బిరు దందుకొంటి నీవునేను ॥కో॥

కామిక్ — రైలుబండి తమాషా.

పవనమంటె రయముచేసి బయలుదేరె రైలుబండి । మెయిలుటపా జనములోడ మదరాసునుండి ॥ప॥ భుగభుగమను పొగలజాడ భూమిని పెను ధూళినిండి । దిగనుదిగను నరులజాతు లేకమైరు నిండి । కాకినాడ రాజమండ్రి సామర్లకోటనుండి వేగముగ వార్తేరు వెడలిపోయెపొగబండి । బండి లోన బాటసార్లు దండిగాను నిండి । పండుకొనక పీనులాడి తిండిలేకయుండి మైలు కోసను ఆమడంటె మరపింపజేసినాది । కన్నుమూసి తెరువగానె కల కత్తా పోతాది దిగ్ రోన్.

కామిక్‌పాట

వద్దురా పెండ్లాము వద్దురా । ఇద్దరొద్దుసరేకదా ఒద్దుఒద్దు ఒక్కరైన మొట్టికాయ మొట్టుతుంది మూతివిరుగగొట్టుతుంది । అట్టుమాడగొట్టుతుంది

జుట్టుపట్టి లాగుతుంది ॥వ॥ కరములయ్యో బందాలు కాళ్ళకుసు కెళ్ళు వరపతి తీసిపెట్టు వక్కలిరగ తంతుంది ॥వ॥ కూలిశేక్సి బర్శుకవచ్చు జోలెత్తికొనగ వచ్చు । అలికాళ్ళ తాపులకు ఆగలేము ఆగలేము ॥వ॥

## కొయ్యోడి పాట.

చుక్కలకోకకట్టుకోని చుట్టుగోటు రవికతొడిగి బుర్రినున్నగదుక్కోని బొట్టుకాటుక బెట్టుకోని నోట్లిలొచుట్టా బెట్టుకోని గోటుగా నేనదుచుకుంటూ చక్కదనమే చూచుకుంటు యెక్కడికెల్తావు చిట్టమ్మంటే పోతేరమ్మ మెరకలమీదికి పుల్లలకెల్తాను కొయ్యోడో రయ్యో ॥కొ॥

కర్రిచేత బట్టుకోని కిర్రుచెప్పులు తొడుగుకోని పాయలమొలతాడేనుకోని కాయవచిటు కట్టుకోని వక్కలాకు లేసుకోని టీకుటాకుచేనుకుంటూ యెక్కడికెల్తావు కొయ్యోడంటే పోతేరమ్మ మెరకలమీదికి పుగాకు కెల్తాను చిట్టమ్మో లమ్మో చిట్టమ్మో మనమిద్దరి మెక్కడికెల్దామే లమ్మో చిట్టమ్మో॥

చీటికిమాటికి చిట్టమ్మంటే ॥చీటికి॥ చీపురుదెబ్బలుతింటవురో రయ్యోరికొయ్యోడ నువ్వు ॥చీపురు॥ చిట్టెమున్న నడీదిలోను చినబాబుంటడు పెదబాబుంటడు కరణాలుంటరు కాపులుంటరు చిట్టమ్మని పిలవకురో రయ్యోరి కొయ్యోడ నే కుందను నాయుడు కూతుర్నిరో రయ్యోరి కొయ్యోడ॥

అబ్బోఅబ్బో అలాగునయితే కుసాకురసా మెక్కలపీట కుందను నాయుడు కూతురువయితే నే మద్దప్పయ్య మనవణ్నే లమ్మోచిట్టమ్మో మాటికిమాటికి కొయ్యోడనకే ॥మాటికి॥ మడమాతాపులు తినగలవే లమ్మో చిట్టమ్మో నువు ॥మడమా॥

పావలడబ్బులు పట్టుకోని పాలకొండ బజారుకెళితే ఖర్చు లెక్కడ చెయ్యనోరిరయ్యోరి ॥కొ॥ యిచ్చురూపాయి పట్టుకోని విజయనగరముసంత కెళితే ఈదులన్నీ తెలుసునురో రయ్యో ॥కొ॥ యింటియెనకల పెంట ఆ పెంటదగ్గరగొయ్యి ఆగొయ్యిదగ్గర గుడిసి ఆగుడిసిలోనె గుంట ఆగుంటకు నీకు తంటారో రయ్యో ॥కొ॥

## వేమూరి గగ్గయ్యగారు, బెజవాడ.

### సోహిని — త్రితాల్.

కుటిలాత్ములార యెందుకీ ఎందునుగందు మదాంధముకుందున్ తృటినడతు, పటమటల పటుతరగతిఁ నిటలనేత్రి చటులదీప్తి నుడువగనే నెదఁ ॥కుటి॥ నాసోదరిసుతుఁడా ననుజంపుఁ వీసమైన దాక్షిణ్యంబింకఁ మదినిగ్రుదురు టోదవనేలనింకన్, ఖరతరాసి శిరమునరికివైతుఁ ॥కు॥

### కల్యాణి — త్రితాల్.

కావరమున కారులు పేర్లెడు మీకండకొ్రొవ్వదీర్చి దుండగమడతు ॥కా॥ మీదుడుకుతనము సాగిరాదికను మీరరయక వాదులాడనగునా, చెడుగు శితలుడుగ దలపకుండిన నడరులడచి జడతలుఁపి విడిచెద ॥కా॥

### అఠాణా — జంప్ తాల్.

ధిక్కారమునుసైతునా కుటిలజన, అభిమానహీనుడై అటునాదు జనకుడే సభికులారడిపడఁ సలిపి శిక్షింతునే ॥ధి॥ జగముకంపింపగా, జనము క్షోభింపగా, ఘనశౌర్యమేపారగా విజృంభింపగా, ధిక్కార ధిక్కార ధిక్కారమునుసైతునా॥

### కామిక్.

ఓరి పింజాం చీచీ పింజారి నీచగులాపోడా మీ నీవాటా ఏపేనా రెట్టియేమో వాగుచుంటివి యీసారి నాపేరత్తిచూడు ॥ఓ॥ వచ్చెఁ దీనికి నిఖాసెయ్యడాన్కి మాకిఖుషుహై (నవ్వు) ఖుషీ హేహమారెప్యారి చీచీచీ కూర్రుడా చీచీచీ పోపో చీచీ పింజారి ॥ఓ॥ చంద్రాబాక్ ధేక్ యేసహ జమాఁ మహర్రాజ్ హుజుర్కాదారు కైసా నిపాచేస్తాది తోడతోడతాగి మూసి ముద్దుయేసి హహహ.

### కామిక్ — డైలాగ్.

ప్యారితేరిముద్దులు్కా తిన్పించుతే జంర్రిముద్దులుకా వట్టిముద్దులుకా చోటచోటముద్దులుకా ముద్దులుకా తినిపించు మోమునాకు చూపించు వద్ద నిల్చిమాట సెయ్యవద్దు కోపంనాది మీదసుమ్మా

నన్నంటగరాదుసుమ్మా మాయింటివారు రానిమ్మా ఖల్ తంటాలు చేస్తారుసుమ్మా

## నిట్టల వెంకటేశ్వర్లు అండ్ బి. వెంకట్రావు.

డైలాగ్ — కంస, క్రిష్ణ సంవాదము.

కం—హీనపూతను జంపినానని పొంగకు
చాల తాళ్ళచేగట్టి చంపివైతు

కృ—భక్తితాళ్ళచే కట్టుబడుదునేగాని
నీబంధముల్ నను గట్టివైవగలవె

కం—జలరాశిముంచి ఏ బిలుకుమార్చెద క్రిష్ణ
చచ్చితివింకెందు చనగగలవు

కృ—జలరాసి మాయిల్లు జలరాసి ఓమామ
ఆయబ్ధి నన్నేమి చేయగలదు

కం—కొండక్రిందనువైచి దంచించి ఖండించి
పరలోకసుఖము నీకరయనిత్తు

కృ—కొండక్రిందను నేను నుండెదనోమామ
పరలోకసుఖమె నీకరయనిత్తు

కం—నీరూపమడగించి నీగుణంబులమాన్పి
మదినున్నచింతల మాన్పువాడ

కృ—రూపమేలేదు నారూపుమాపెదవెట్లు
ఓమామ నీచింతయుండదింక

కం—యెందు డాగితివోక్రొ నీవిన్ని నాళ్ళు
నిపుడువచ్చితి నాకార్య మెల్లదీర

కృ—నీదు మదిలోనునుంటి నేనిన్ని నాళ్ళు
ఆర్తియేటికి నీపనిదీర్తుమామ.

## బ్రహ్మజోశ్యుల సుబ్బారావుగారు, రాజమండ్రి.

బేహాగ్ — ఆది.

ప్రేమమోహన మధానిధాన ప్రియకర । తరళ విశాలనయన । సుఖ ప్రేమ ప్రణయలలిత మధుమధుర మోహనము । అధర రసాస్వాదిత సుఖ మొసగుమా ॥ప్రే॥

అంత నాకి తెల్సును పికర్ యింత నాది మనస్సులోనలేదు రొంతనా మాటల్ కివిను రవ్వంతా పెద్దగోడమీదనెక్కించి బాగాకూర్చుండ పెట్టాక్ మోటార్గాడీమీద నెక్కించి శాజార్లొతిప్తాన్ టర్ర్ర్ వహ్వా లడ్డూల్ మంచిపకోడీల్కి అహా పేణీల్కి మంచి షక్కర్కి వహ్వాజామ్మర్కి ఫాక్ సుపారీకి సాబ్బీకిలావుంగా షాదీకరుంగా తేర షడర్కి రక్కర్ దిఖావుంగా ముద్దులక్కి॥ (వహ్వ)

## డాక్టర్. సి. హెచ్. బి. వెంకటాచలంగారు, విజయనగరం.

గైరమ్మపాట.

కల్లుమంత చూపినావు కన్నుగీటినావుకాని । వట్టుపెట్టింతానంటు వల్లకుంతాదా గైరమ్మోదినో నామీద దయానుంచుమా । వకపరికొడితో నాలబుకులాడివొదిన నివ్వొడికిపోక వొదనో । ఒ ఒ గైరమ్మోలె గైరమ్మోలె గైరమ్మ । నిన్నేతల్లి గన్నాదోలె గైరమ్మ । నీవొల్లెంతో సక్కని దోలె గైరమ్మ । నీపళ్ళుకళ్ళు చక్కనివోలె గైరమ్మ । నిన్నే టేటో చక్కందె గైరమ్మ । నువు సక్కని చుక్కవోలె గైరమ్మ । అందెలు కడేలు కణేల్ కణేల్ మంటేను । సందలుగాజూలు ఘల్లుఘల్లు మంటేను లగాలగీ లగాలగీ గలగలగలగల మంతాదోలె గైరమ్మ । ఘల్లుఘల్లుమంతాదోలె గైరమ్మ । కిలకిల నవ్వులకు తలతల చూపులకు పైటచెంగురాపులకు ధహుఉహుగలగలగల మంతాదోలె గైరమ్మ నిన్నే తల్లిగన్నాదోలె గైరమ్మ నువ్వొడ్డిస్తే వయ్యారంతో గైరమ్మ కల్లువడ్డిస్తే । వయ్యారంతో గైరమ్మ జగన్మోహిని వాతావోలె గైరమ్మ జగత్ మోహిని ! లాగుంతావోలె గైరమ్మ॥

## పాట.

భారతమాతా! నీకన్యలగతిగనవమ్మా ॥ప్రియ భా॥
ఇహపరసౌఖ్యము బాసి ఇటులైతిమితల్లీ ॥భా॥
భారతమాతా మాబ్రతుకిటులే చెడెనమ్మా॥
పరమగురాగత మగునీ వరశుల్కము వలన
జీవితసౌఖ్యముబాసి తనువులపైఁగోసి ॥ప్రియ భా॥
ఇలలో ధనలోభులవలన బలియైతిమి మేము
మాజీవాత్మలకెపుడో మోక్షంబా జననీ ॥ప్రియ భా॥

## పాట.

విధిగతి గడువతరమె పరమేశా విబుధేంద్రునకైనా విధికైన ॥వి॥
ఈసంసారం బీలాగై బోయె నేడు కాసైన లేదాయె గ్రాసానికైన
ఈఘోరదారిద్ర్య మెన్నాళ్ళో మాకు మాజీవనోపాధి కీవ్యాధి వెన్నాడె
సర్వాధారంబౌమా తరువే మోడై ॥ఈసం॥

## పాట.

బ్రతుకీగతి కానేలా! ॥బ్రతు॥ నాదగు పావనుదేమీ స్వామీ ॥బ్ర॥
నాకారకేగద వృథా అవిధానా బలిమి బలియొసగె అమానవతి
బ్రతికియుంటె యీబాధలనే అనుభవింపగా నా ॥బ్రతు॥

## పాట.

జీవా! మాయాకాయమురా మమతలలోబడి చెడితివిగదరా
మాయజీవా!
అడియాసలలో బడుటేగాని కట్టుకుబోయేదేమిటిరా ॥జీవా॥
కట్టెబొగ్గులో కాలేటప్పుడు గవ్వరాదురా నీవెంబడిని
ఏటికి నీయారాటంబింక
ఎప్పుడో యేమో ఎరుగుమురా త్వరపడరా
కడతేరెడుగతి గనుగొనరా ॥జీవా॥

## అప్పన్నకొండపాట.

అపన్నకొండాకి యెప్పుడెళ్ళినగాని। చెప్పుకుంటే సెడ్డ సిగ్గోలప్పమ్మ ॥సె॥ మాన అంకమ్మకాయింది దిబ్బప్పికాయింది అయితిరే అందుకక్కల దాయి అప్పమ్మకాయింది ॥సె॥ మెట్లెక్కనప్పుడే సప్పిడితీస్తారు దొంగ నా కొడుకులోలప్పా। ఉండాళ్ళిగండలోలప్పా । కొమ్మనున్నయి మంచి దబ్బపళ్ళంతేను । కోదమని సూత్తుంటె సారవసెయిబోతారు । ఉండాళ్ళి గండలోలప్పా ॥అ॥ తానమాడినకాడ తడిసిమేముంతేను రెప్పలెయ్యాక చప్ప లిస్తారు రెప్పలెయ్యాక సప్పలిస్తారు ॥అ॥ సేతులెత్తిమేము పరవడెల్తుంటేను రెండుసేతుల నందుకుంటడే రెండుసేతుల నందుకుంటాడే సుంకంబుసెల్లించి సారవగెల్తుంటేను గుంపుదాటినగదా గరబగుడిమనకి । గుంపుదాటినగదా గరబగుడిమనకి । సామే సిమ్మాద్రిరప్పన్న సామే సిమ్మాద్రిరప్పన్న అప్పన్న నామొక్కు.........

"ఓలప్పా అదేటిచిత్రిమోకాని చూసినావు"

అద్దరేతిరికాడ నిద్దరోతుంటేను శతమాని పిసరికే చెయిచాపినట్లు అంతలో నావళ్ళు జల్లుమన్నట్లు । మాటరాక నాను మనసిచ్చినట్లు 'ఓలప్పా' అన్నెపున్నెముజేసి కన్నెలువేసి ఆకరికి అతగాడె । అప్పన్న నన్నట్లు కల గాచి నాతుకలగాచి నువ్వుకలగాచి । లేచి నావొళ్ళుచూసుకుంటే అన్నీ టికన్ని సరిపోవాయోలప్ప । సెప్పుకుంటే పెడ్డసిగ్గోలప్పమ్మ ॥సె॥

## కామిక్ 1 వ భాగము.

నాకాలమునాడూ నాఏలమునాడూ । నాకాలమునా డేలమునా డే లాగుంటే నేటే ఓలెపిన్నమ్మా । నేనేలగుంటే నేటే ఓలెపిన్నమ్మా । మేన త్తకొడుకైతె నామేనత్త కొడుకైతె । బొత్తిగా మెత్తనైపోనాడని మారుమనుమనకంటిని । మంచిచినపిల్లవోణ్ణి । ఒయిసుపోలేదని ఒగ్గేసి బాలు ణ్ణి ఒగ్గేసి సిగ్గిడిసి మోటనాగండణ్ణి మురిగొలిపినానే । మురిగొలిపి కలిసిరం గం పారిపోనామే కలిసి రంగం పారిపోనామే । కాసింత కూసింతో ఎలాగో

ఓలాగు । కాపురంచేస్తుంటె పరమనాయాళ్ళు ఓలమ్మ । పరమానాయార ళ్ళు బందోబస్తుచేసి ఓలమ్మ. బందోబస్తుచేసి భార్యాభర్తలకు మాకు పడ కుండజేసేరూ । మూడోమనుమునసైన ముచ్చటలేకుండా । నోటికి ముద్ద లేకుండా ఒంటికి గుడ్డాలేకుండా ॥నా॥

2 వ భాగము.

మారుమనుముకొడుకు మంచివిల నున్నాడని । కొండిసై సిగ్గిడిసెలితే ముండ ముండ । కోకలి మెడ గెంటాశాడో మెడ గెంటాశాడో

వచనం:—పిన్నమ్మా నాబాలతనాన్ని గోరింకనాగ పిగిలిపిట్టనాగ పికపికలాడుతు పకపకలాడుతు కిసకిసలాడుతు అంగ ఎన్నముద్దనాగ నేనుంటె మంచో సెబ్బరో అని

పాట—మాయమ్మ ఎల్లినూపింతేను । ఎంకన్నబుగదంటె వంచాంగ మెంకన్నబుగదంటే మంచిదని మాయమ్మ మతినాకిరిసింది ।నామనసిరిసేసింది

వచనం—ఓలమ్మ. అదేమిటోగాని ఆమతిమతి నాకిప్పటికీ అదేమతే.

పాట—అప్పికొండేళ్ళేము । అతీర్థమాడేము ఆపాట్లుపడ్డాము । అదే వూరిబుగతోగాని మూడణాలుచ్చుకోని । ముందలిమొక్కించుకోని తనకే ముందలి మొక్కించుకోని । మూడుదేవుళ్ళాకు ముమ్మారు మొక్కించి ఆది దేవుడుకాడ మనకెల్ల ఆదిదేవుడుకాడ । తొలిచదువు చదివించి మలిచదువు మంతరాలు । మారోపాలిచదివి అఖరుచదువోలమ్మ యెంతోనేపైలేను ఓల మ్మా యెంతోనేపైతేను యీడుబాసినదాన్ని । కెవ్వుమన్నానుగాని కెవ్వున పొంగిపోనానుగాని । మూడవలసినకీడు మూడకపోతాదా పోయీకాలము బుద్ధి పుట్టకపోతాదా । అల్ల బ్రహ్మరాసినరాత ఒమ్మైపోతాదా॥

ఉడుపుళ్ళపాట.

ఉడుపుడవండమ్మలారా మీరు ఉడుపుడవండమ్మలారా కచ్చాలెగ గట్టి మడిదిగిరండమ్మలార ఉడవకుండమీరు వంగొనిమాట్లాడుకుంటె ఒడ్డున కూతున్న బుగత వూరుకోలేడుబుగత ఊగులాడకుండ ఊగులాడకుండ గుళ్ళ పేర్లూగులాడకుండ మీపైయాడచెంగుల్లో పెట్టేసికట్టేసి ॥ఉ॥

పావతల్లుల్లాల మల్లీవెలుదురుగాని పాలెట్టి మల్లీవస్తురుగాని నడుము నొప్పనకుండ నాలుగు మొనలేసుకొని నడుమునొప్పనకుండ నాలుగు మొనలేసు కొని ॥ఉ॥

వయసుకట్లెల్లాల పూరుకోబోకండి ఉడుపుకాలముపాట పాడుకొని మీరు ఉడుపుకాలముమాట పాడుకొనిమీరు ॥ఉ॥

... ... ... గానీ కడుపునిండినపంట గలగలాని మొక్కి నం దీశ్వరుదయలేదు నందిదేవున్ని మీరు నెత్తిమీదెత్తుకొని ఊరంత తిప్పినగాని లింగమూర్తి దయచేత అల్లాలింగమూర్తి దయచేత పిల్లానెత్తుకొని మళ్ళీ మళ్ళీ ఉడుపుకొత్తురుగాని ॥ఉ॥

వచనం—ఓఅమ్మలాల అట్టే నిలబడిపోకరాి ఒంగోని మునువు గట్టరాి ఓ లేలమ్మ నీసిరాకు వుండే అచ్చమ్మ మనుమరాలు. ఎత్తురా లయ్యింనని చెప్పరాి బుగతోరి పెద్దమడిలో ... ... ...

వచనం—అచ్చప్పా నీవు ముండెత్తే గుంట్లెనకపాడతారు.

పాట—నోమి నోమల్లాలో నోమల్లాలో రామచందనాలో ॥నో॥

పాట.

మంతిర్గములార యీవరకట్నముల దోలగింపగా
శాసనముగావించి సంఘము సకలవిధముల గావరే
ఆర్యధర్మము నిలుపుడీ స్త్రీజాతి దుస్థితి బాపుడీ
గరవధూవరపరిణయంబులు నిరంతరము శుభములై
యశోగర్భాచరణమునకై వెలయుగా॥

పాట.

కన్నెయుసురు తగదండి వరకట్నాలను నిలువండి ॥క॥
దేశోద్ధారకులారా! జాతీయాశయులారా ॥భారత దేశో॥
సంఘములో జరిగెడు ఘోరవరశుల్కదురాచారము మాన్పరే ॥దే॥
వెలమగలేగ? యీవరులు వివాహవిధి యీవిధి చెడెనండీ
కన్యాదాతల గతి గనుగొనుడీ దురాగతంబిదికాదా॥

పద్యం.

చం. పరువునశించె పండితులు పామరులున్ని యింటింట నా
చరితమేఁ జెప్పకొంచు నెకసక్కెములాడు నవస్థపట్టె ము
ష్కరమునఁ దండ్రికిప్పటికి గల్గకపోయె నుదారబుద్ధి యీ
తరుణమునందు మూకునివిధంబుననుండుట నాకు బాడియే.

పద్యం.

మ. చెడె ధర్మంబు నశించె నీతి హరియించెం బూర్వమర్యాదలం
గడి కూరాకువిధాన వేలమునఁ జొక్కాటోపి ఫ్యాగాలకై
వడి సంతం బశువట్లు పెండ్లికొడుకుల్ వ్యాపారమార్గంబునం
బడయంగావలె ద్రవ్యమింగురిసి దైవంబైన నేడిమ్మహిన్.

పద్యం.

సీ. నీటైన యింగ్లీషు మోటారుసైకిలు కొనిపెట్టవలెనను కూళయొకడు। రిస్టువాచియు గోల్డురింగును బూట్సును సూట్లుగావలెనను శుంఠయొకడు। బియ్యేబియల్ వరకయ్యెడి కర్చు భరింపవలెనను దరిద్రుడొకడు భార్యతోడను చెన్నపట్టణంబుననుంచి చదివింపవలెనను చవటయొకడు

గీ. సీమచదువు చాల సింపిలు నన్నట కంపవలయునననెడి యజ్ఞుఁడొకడు। ఇట్లు కొసరుకిరింద నిష్టార్థములు వరుల్ తెలుపుచున్నవారు తెల్లముగను.

పద్యం.

సీ. కులలోప గుణలోపములు మాపుకొనుటకు ధనము, ప్రధానసాధనము నేడు।వరకట్నములకు సభాకట్నములకును ధనము ప్రధానసాధనము నేడు మునిసిపల్ లోకలుబోర్డు యెన్నికలకు ధనము ప్రధానసాధనము నేడు। మడులు మాన్యములు కొంపలు వచ్చిపడుటకు ధనము ప్రధానసాధనము నేఁడు

గీ. అట్టిధనమును తమ పాడుపొట్టకొరకొ బట్టకొరకొ లంకపుగాకు చుట్టకొరకొ వెనుకముందులు చూడక వెచ్చపెట్టువారు నిజముగ మతిలేనివారుగారె.

పాట.

కొరగాని యీతనువికేలా దైవమా ॥కొర॥
పరతంత్రితను జీవనరకాన బడిపోతి
పరువుచెడి వరశుల్క పాపాన గురియైతి ॥కొర॥
ప్రియురాలి యిల్లాలి లాలింపలేనైతి
ఈదుర్వియోగాన ॥కొరగాని యీతను॥

పాట.

ఎన్నడు నాపతిఁ గూడిసుఖింతునో ॥ఎన్నడు॥
బన్నము తీరె దారె లేదాయె ॥ఎన్నడు॥
ఈవిగహాబ్ధికి యేదరి లేదా!
దైవమా! నాపై దయ మాలితివా ॥ఎన్నడు॥

పాట.

నానోముల ఫలమే మనసా ॥నా॥ కోర్కెలెల్ల మానుటే సుఖంబౌ॥
వనసును మీ వయసు వృధా తనువు వృధా వలపువృధా
లేదిక సుఖాశ వగవగనేలా జగము సకలమును శూన్యంబెకాదే॥నా॥

పాట.

ధీరమతీ దిగులేటికిరా ఊరకయేలా నాదారిపోవ ॥ధీర॥
వరమప్రేమను భంగము కలదా బాలకా పరమాత్ముడులేడా!
నీమనోరధమే సమకూరుగ ॥ధీరమతీ॥
ఏలనిరాశాగతివాబోవ శీలవతి కమలాసతి నీమతి
మేలుతెలియదా ॥ధీరమతీ॥

పాట.

సంగీతసారమిదిరా జగతిలో జాతీయ తేజోవికాసంబేరా రాగాను
భోగ ॥సంగీ॥ త్యాగభోగానందసారమే గీతమురా సామవేద సుధాసారమై
ఓంకారాధారమైన ॥సంగీ॥

## కీర్తన.

పలుకవేమి నా దైవమా రామ పలుకవేమి
పరులునవ్వేది న్యాయమా రామ ॥పలుక॥
అలుగకారణ మేమిరా రామ నీవాడించినటుల
ఆడిననాతో ॥పలుకవేమి నా దైవమా॥
తల్లితండ్రి భక్తినొసగి రక్షించిరి తక్కినవార లెంతో
హింసించిరి తెలిసియూరకుండే దెన్నాళ్ళురా
దేవాదిదేవ శ్రీత్యాగరాజునితో ॥పలుక॥

## పాట.

పూలమొక్కలెటులున్నవో పోయిచూచెదగ ॥పూ॥
చాలకాలమునకు నేడు సంపంగిపూచినదే
రాలిపోయెనాకులన్ని మాలతీలతగ
సోలిపోయెనే సూర్యకాంతము ॥ఆ పూలమొక్కలెటు॥
వింతగానుపూచె చంద్రకాంతులు చేమంతులు గురు
బంతిమొక్కలన్నియెవరో పాడుజేసిరే
దొంతరమల్లియును గూడ దుంచలేదు కొంతనయము
అంతుదెలిసి శేపువారి నడుగనా॥

## పాట.

జాతికినీ నూత్రించే సంవత్సరమా సాధనము ॥జా॥
ప్రేమమయమై సత్వగుణమయమై మా
కామితార్థము లొసగుగ ఐకమత్యమున కీదారంబే
ఆధారంబై వెలయును గా మాతృభూమికిది మంగళమే ॥జా॥
మాతృదేశ పాదసేవా మహిమ దెలిపే మంత్రంబౌ నీ
నాదబ్రహ్మో పాసనలోనే లీనంబై నే తరియించెద॥

## పా ట.

వినివిది యేమి ప్రారబ్ధమే యేగతి వేగుదుమే నీతో ॥హి॥
సుతలే యీలాగెదిరించినచో గతియేమున్నదే మా ॥హిత॥
ఆడుది పెండ్లిమానుట మనదేశాచారముగాదె
అయినవారిలో కానివారిలో అపయశమే తల్లీ
వీడుము నీ వివాదముఁ పెండ్లికి సంబరపడుమా!
నేడో రేపో సుముహూర్తము నిశ్చయింతురుసుమా ॥హి॥

## పా ట.

పరుగిడకే చంపక మే భ్రమరీ పరుగిడకే
ప్రభాతమునుగని పరవశమతివై పరుగిడకే॥
గుములుగుములుగా గోపకన్యకలు యమునానదిలో
జలకమాడుతరి కమలములో కమలాసనలో మరి
పరికింపవె త్వరపడకే భ్రమరీ పరిమళమే
సరిపడదే మనసా పరుగిడకే చంపకమే భ్రమరీ॥

## పా ట.

సుందర నందకుమారా జయ బృందావనసంచారా జయ ॥సుంద॥
గోపికానయన కువలయమాలా మేళితలీలా వనమాలా
మురళీధర మాధవశౌరీ మురహర గోవర్ధనధారీ
పంకజనయనా భవపరిహారీ కరుణాళరధే పరిపాలయ మాం ॥సుం॥

## పా ట.

స్వాతంత్ర్యమేలేదా? యీ స్త్రీజాతిలోన
జనియింపనేలా నే స్త్రీనై పాపమేమి దైవమా ॥స్వా॥
కట్నమిచ్చి కొంటేగాని కన్నియలకు వరుడే రాడు
కన్నవారికా కోత కన్యజన్మమే రోత ॥స్వా॥

## పాట.

శాశ్వతమా బ్రతుకీ ధాత్రి బహుళ శోకమయుమే కాదా ॥శాశ్వ॥
భోగికైన నిరుపేదకైన జోగికైన రారాజుకైన
మరణ మహార్తి పమానమెగా శ్రీహరి పాహీ యనవే ప్రాణీ
ఈ యనకాళము పోనాడకయె ॥శాశ్వ॥

## పాట.

మాయావిలాసమే కాదా జగతీ మాయ మోహ మేలా ॥జీవా॥
దానశీలమే ధర్మముకాదో సత్యమె జయముగు కాదో
భాగ్యభోగముల్ బాయక నిలుచునా మూడునాళ్ళది ముచ్చటకాదో
ముక్తిసెద విది కలకాదో ॥మాయా॥

## పాట.

సుప్రజాలోలా ప్రియపాలకా రతీమోహనా ॥సుర॥
ప్రాణము బడసిన బాలబాలికలు ప్రణయవాహినిని నీదుటలేదా
ప్రణయమె స్వర్గము ప్రణయమె భోగము నీలీలల
కీభావుణిచేనిలయము ॥సుర॥

## పాట.

శోక పూరితము గద సంసారము ముక్తిసెద వనియేలా ॥శోక॥
అప్పవర్గను లరికట్టునుగా మోహము కన్నుల మాయనుకాదా
పునరపి జననం పునరపి మరణం ఏలాబడసెవవె మూఢపుజీవా
జ్ఞానోదయమే కలుగదుగా. ॥శోక॥

## రెండుచింతల సత్యనారాయణగారు.

### తిలంగ్.

గోపాలబాలకృష్ణా గోపాలబాలకృష్ణా । గోపరిపాలన గోపికలోలా ॥గో॥ మోహనమురళీ నగధరవందిత । మునిజనసేవిత మోక్షదాయక ॥గో॥
భవభయపాపవి భంజనమగునీ । భక్తినోసంగుమ భక్తపాలకా ॥గో॥

# గ్రామఫోను పాటలు.

## రాట్నం పాట.

1. మనుజాళికి నీ ధరణీ ప్రధానా కల్పభూరుహమె ॥మను॥
హైందవజాతికి జీవనమార్గము రాట్నసమానతి రహితుంధ వార్పుచు
2. రాట్నముకాదు సుదర్శనచక్రము రాట్నము త్రిప్పుడు జనులారా॥
3. వినుడీ, నిజంబు కనుగొనుడీ పరమపావన నేతవస్త్రములు
కోట్లమానవుల పరమావధియో॥
4. చేరము మంచిదిగా ధనార్జన కనువగు సాధనగా॥
5. దేశము లిల సౌభాగ్యంబై శుభకరమగుకాదా॥
6. నేతవస్త్రముల సేవగింపకుడు పావనంబు ఇది నుండీ
పాటవంబు మెయి మేటికిరాటులు భాగ్యవంతు లవలేదా ॥మను॥

ప్రొఫెసర్. నారాయణరావుజీవ్యాస్‌గారు.

దేశ్ — తిలంగ్.

శ్యామసుందర మదనమోహన కుబరీసంగ ప్రీతకీనా । అభమసోగ్ గోకులఃహో హోనజాయ్ ॥శ్యా॥ గోకులరీల ఛాండోకీన్హా మధుంమే న్యావలీనో । ధాయె ధాయె గాయె గాయె అభమసో గోకులరహో । హోనజాయ్ ॥శ్యా॥

## జాతర పాట.

పిల్లజల్లలను సల్లసీసపు గ్రామదేవతవు కావె
వారపోతునే గంగమ్మా దయనూసరావె మాయమ్మా
మేకపోతులను కోడిపుంజులను
కల్లుకుండలను అరమిత్తుమే గంగాలమ్మా ॥దయ॥
దయనూడుమమ్మా శివ సాంబుకొమ్మా
సలిదిత్తుమమ్మా నినుగొలుతుమమ్మా ॥దయ॥
బండెడుకూడును గారె బూరెలును నైవేద్యమిత్తుమేమాయమ్మా॥
ఏటికేడాది నేనీ జాతరే సేయిత్తా
ఊరికే కీడూ లేక కావవే మాయమ్మా ॥దయ॥

## 46 నవ పాటలు.

### మిస్. వనజ

### కామిక్.

గోరిముక్కు తోర్రినోరు బర్రిగొంతు పెండ్లికొడుకు। చిర్రిముద్దులాడి పూలచెండులాడెనే। మేల్ బంతులాడెనే ఎగిరి గంతులాడెనే గోచిపాత వీడెననుచు జనులుచూచినవ్వ। పెండ్లికొడుకు పాచిపండ్లతోడ పూలచెండులాడెనే। ఎగిరిగంతులాడెనె మేల్ బంతులాడెనె ॥గో॥

### హాస్యపు పెండ్లిపాట.

వదినెలందరు వచ్చిరి వయ్యారముసకు। వదినెలందరు వచ్చిరీ। వదినెలందరువచ్చిరీ మిక్కల సంతోషించిరి। వగలుచేయుచు వకరికొకరితో వాదించుతువచ్చిరి। పిల్లికుక్కలవాలెను మావదినెలందరు। పందిమూతులవాలెను బానకడుపువారుగా। కోరపండ్లుయుండగా వగలుచేయుచు।వకరికొకరితో వాదించుతువచ్చిరీ। సారిగామా పాడెదరు మావదినెలందరు సంగీతముపాడెదరు ఇట్టిసభవారందరూ పెండిలిషండిరి। కొచ్చిరి వగలు చేయుచు వకరికొకరితో। వాదించుతు వచ్చిరీ.

### హాస్యపు వివాహపుపాట.

చింపితల చిక్కుదీసి। సంపంగినూనెపూసి సొంపుగ కట్టిస్తివేవదినా పేడగంప యాడపెట్టితివే దినమొక జతసొమ్ము సరిపితిపిలి సొమ్ము చిన్నినాడె అన్నినాద। చింతకాయల గంపయాడనె జౌనౌనా ఓసి అంతటిమాకు చాలుచాలును। పోవేవదినా సరసంబులాడకువె వదినె॥

### కామిక్.

అత్తపేరు అటుకులచాట మామపేరు మంచంకోళ్ళు। నాపేరు చిలకలకొలికి పెండ్లికొడుకుపేరు సుబ్బంబొట్లు చక్కనిఅత్తమ్మవారికి జయమంగళం ॥అ॥ మొగలిపూల ఇల్లుకట్టి మల్లిపూల మంచంవేసి। మంచిలంజ లేకపోతె మంచంఎక్క మనసురాదు। చక్కని అత్తమ్మవారికి జయమంగళం గూటములోగోడకింద కుక్కలు రెండు పిల్లలుపెడ్తె కొడుకుపుట్టెననుచు మరిది పుత్రోత్సాహము చేయించెను చక్కనిమామరిదిగారికి జయమంగళం॥

నువ్వూ నేనూ నువ్వూ నేనూ ఊసులాడుకుంటాయంటి వు

దోశ్రీపిల్లా ॥వెం॥ నీకునాకు ఈడుజోడు నీకునాకు ఈడుజోడు నీతిబాగా చూడు ఆలోచించిచూడు షైటమాట లాడు రా నాయెంటనే అంటువూ మిడితోటకురా ॥అం॥ ఆహా గాంధికోకకట్టుకోని పేడతట్టబట్టుకోని ॥గాం॥ సామ్ములు మలగొట్టుంటే మనసుపట్టున గోపాలకృష్ణమూర్తి తైవగాని మనసు పట్టు చెట్టోగట్టో సాటుపెట్టి గట్టిగముద్దెట్టుకోడపిల్ల ॥చె॥ 4 అట్టిచక్కాని చుక్కవనిగదా ఓలెపట్టి చిట్టెజట్టీడిపోవాని ఒట్టెట్టుకుంటాను తా ॥అం॥ నీయమ్మచూడకుండ నీయన్నకి తెలకుండ నీయప్పకైన చెప్పకండ ఇదిగో మితాయియుండ రా ॥అం॥ ఆహానువ్వూ నేనే ఇలుచూపుచూచికుందాం పెల్లి చేసుకుందాం సరసమాడుకుందాం ఆడుకుందాం సరసమాడుకుందాంరా॥అం॥ ఉడుపులెల్లిపోనాయి కోతలెల్లిపోనాయి పండుగొచ్చిందిగాని నీమనసొచ్చిందిగాదు ఆహాఓలె ॥నువ్వు॥ 4 యేకమైతే పెద్దపండుగాతాది రా ॥అం॥

## చచ్చడిపాట.

ఆ......మామిడిపల్లో

వచనం—ఒరే నాన్నా మామిడిపళ్ళు కొనవురా. రా గులాపివెధవ రామేశ్వరపు రాచిప్పలాగ మొగంవీడు చూడు. పోలాస్తుంది రానియ్యా రా మీయత్తని యింట్లోవున్నాయిగానటూరి యిస్తుంది. దీని దగ్గిరవే బాగుంటాయి. ఇవే నాక్కావాలి. ఒసే రెల్లీ మానాన్న రమ్మంటున్నాడే నిన్ను.

యెలాగిస్తావేంటే.

చూడుబాబు నాదెంచేసి చూడుబాబు. పంచదారాలు, అమృతపాణీలు, అమృతపాణీలు.

చెప్పుదూ.

కోదు అరణాలియ్యిబాబు,

భా యిదంతాకాదు. 61

చూడుబాబు బాగాచూడుబాబు ఆమోటికనొక్కి మాతిదగ్గ స్తావు ముద్దికాడ గిల్లిచూడుబాబు. రుచి అక్కడే కొంచం పుల్లతగిల్నా లేటే జోడా ఆరణాలియ్యిబాబు, వండ రూపాయిన్నరకాదు ముచ్చావక కూడా యిస్తాము బాపనయ్య కొన్నాడు పళ్ళు.

పాట—బాపనయ్యా బాపనయ్యా అగ్గురారం బాపనయ్యా ॥బా॥ పల్లు కొని తిన్నావు యెల్లవయ్యా బాపనయ్యా డొక్కముక్క ॥డొ॥ బాపనయ్యా డొక్కముక్క ॥బా॥

వచనం—అయ్యయ్యయ్యో యింట్లో కెళ్ళిపోతున్నావే మణ్ణీలు తెచ్చుకుంటున్నానే

బాపనమ్మకి మడికొట్టుకపోతున్నాది. బట్టతడిఅయిపోతే ఒల్లు మడి అయిపోతాది అమ్మా మీఅంట్లుతో మినోళ్ళకి అడిగేస్తే చెప్పేస్తారుగదమ్మా మీయాపారాలు మీయాశారాలు.

పాట:—జనకడి లబుజనకడి జనకజనక యెంగిలికుండలనీల్లు బోసి పిసికి పిసికివచింతవండు చారుగాసుకోరా మీరు ఆబాపనమ్మ బోడి బోడి బాపనమ్మ.

వచనం:—అయ్యయ్యయ్యో రెల్లిముండ బజారుముండ పీతిముండ ఆటముండ రెల్లిముండ చాకలిముండ నీతో నాకేంటిపోవే.

వచనం:—యీయమ్మకి అంతా ముండలైపోనారు అమ్మా అహ.

పాట:—తడతడలాడుతాది యెగరేసినజండా లాడలాడలాడుతాది ఓ,లైనకుండ బడబడలాడుతాది బాపనిముండ ముండనినేగాను ॥ము॥ ముంత కేసిన ముండనినేగాను మాతుమనుముజాతి మారాజుజాతో ॥మా॥ ముండలైన రండలైన మీజాతిలో నుండారు మాదొ మారాజుజాతో మారాజు జాతి॥

## పా ట.

కాలముమీరవిధాత వశమా కలవరమింత యేమిది తగునా ॥కా॥

తనదగుపూర్వ కర్మానుగుణముగా ఇతడుచరించును ఈజగతీలో ॥కా॥

ఎలాసమేకాదా ఈనవసతీ పేరిమా॥
జగతిని స్త్రీ జనవిభూతి పతిపద సేవనమే గా॥
3. తెలియగలే రెవరుసుతృటిలో కలుగువిధానమదేమో ॥విధి॥
4. పతియే ధనము పతియేదైవము పతియే గురువగుగా
ప్రాణయాంబుధిని కాంతా కాంతులు సుఖవంతులు కారా॥
5. పూర్వజన్మమున చేసినపాపము లనుభవించక విపోనా
దుఃఖకాలమున సౌఖ్యాభ్యుదయము దైవ నియామకమేకాదా॥

పా ట.

జనపతికే తగునా యీ కూలీయుని బ్రొతుకు ॥జన॥
అధమాధముని సలుపగనేలా సార్వభౌము నకటా దేవా ॥జన॥

పా ట.

మార్గమదేదో గాంచుడీ దేహము నిత్యము కాదిది వినుడీ
సారరహిత సంసారములోఁబడి నాది నీదనెదరేలా ఏవేళా
ఏది సంభవమెు యెరుగజాలరు ॥మా॥
ఎవరికివారే యమునాతీకే సతిసుతబంధులు తామెవరో
జగతిని యీ మాయా తెలియగజాలరు మూఢజీవులు ॥మార్గ॥

పా ట.

రతనాలమేడల్లో రంగైన తోటల్లో దాగియున్నది రామసిలుక
సిలుక కాదది మెరుపు లతిక॥
వలుపుగొలిపీ జనుల మురిపించుచున్నాది తళుకుబెళుకుచూపి సిలుకా ॥ర॥
రాచోళ్ళ పడుచురా రతనాల ములికిరా
పచ్చపసిడీబొమ్మ సిలుక
దాని చెలువంబు సూడంగ కులుకా
మెరుపు మెఱసినట్లు ఎలిగిపోతుంటాది
మేలిముసుగూమాటు చిలుకా ॥రత॥

## పెరుగుపిడతపాట — డైలాగ్.

పెరుగు పెరుగోయంట తిరిగి తిరిగొచ్చేవు పిడతబేరము జెప్పవేమో పిల్లా మాయరుగుమీదను దింపు చూడాలి ॥పె॥

గొల్ల:—మచ్చునూసుకుపిడత నచ్చితే పుచ్చుకో మంచిపిడతే నీకు దొరికింది బేరమాడవద్దొక్కటే తెచ్చిండి ॥మ॥

గంగడు—పిడతలోపట నీరు వొడిసి వుంపీకొంట గడుసుదానవు నీవు కంగారుపడబోకు గట్టికుంటే పుచ్చుకుంటాను నీరు గారుచుంటే మానుకుంటాను, యిష్టమైతే వుందు కష్టమైతే నెళ్ళు మొట్టమొదటే నీకు చెప్పేనూ మొగమాటపడి బేరమాడాను ॥పె॥

గొల్ల— అడ్డుమాటాడను అమ్మకొనవచ్చేను జిడ్డుమీగడ చుట్టు గట్టింది పెరుగుజున్నులాగే తోడుకున్నాది గుడ్డెత్తిసూసుకో గడ్డిలో పెట్టాను గడ్డివొత్తిగించి గట్టిగా వుంపుకొని కదలకుంటే మెచ్చుకోవాలి రోజు నాగంపకే యెదురుచూడాలి ॥మ॥

గంగడు—తట్టలో పక్కబెట్టి బెట్టుసరిజెప్పేవు గట్టిదానవు నీవు చాలాను కమ్మగావుండాలి బాగాను యిట్టిమాటలుజెప్పి యిరిగిపోయిందిచ్చినట్టయితే వొద్దంటె తిట్టుకుంటావేమొ తట్టముందరబెట్టు చూడాలి మా తలుపు లోపలగంపదింపాలి ॥పె॥

గొల్ల—ఆళ్ళయిాళ్ళకుమల్లె నీళ్ళుగలిపిదెచ్చి కళ్ళుగప్పిపోను కలిపి సూపింతాను కానిచ్చి రెండంచు లట్టూకో గట్టిగా వుంపూపి సూసూకో మానకుండ నన్ను మళ్ళిరమ్మని రోజు నాకొరకె నీవెదురుచూడాలి నీవు నాకాళ్ళవద్దకే రావాలి॥

పూరికల్యాణి — ఏక.

మరియాదలెటె మానినీకిక ॥మ॥ సరిలేనివానితో పరిహాసమాడుట ॥మ॥ మంచివానితీరున చించివలె జిక్కితను । వంచనతో దానిజూచి మంచిమదయమెుందునయ్యో । పంచమహాపాతకుని వంచనలన్నిజూచి ఇష్పించెనె వెలయుచు సవరించి సకలెంచుట ॥మ॥

### కామిక్.

గుత్తికోకగట్టి గుత్తిరవికదొడగి ॥ఓ॥ గుత్తిలో మావారుసామి ముద్దు పెట్టెసరు ॥గు॥ పట్టుకోకగట్టి పట్టురవికదొడిగి । పట్నములో మావాళ్ళు నాసామి పాటపాడెదరు ॥గు॥ తలుపుచాటుకువచ్చి తలయెత్తి చూచేవు । తల్లిదండ్రిలేనివాననురాసామి దయయుంచరాసామి ॥గు॥

### కామిక్.

యేమిసేతునే యెలమునిగౌరీ సామిరాకపోయె । సామికి నాకు రుణానుబంధం నేటితోసరిపోయె ॥ఏ॥ మొక్కిన మొక్కులు చల్లగయుంటె మగనికండ్లుపోతె । ముంగిటయుండె మునీశ్వరునకు పొంగలి నేబెడుదు ॥ఏ॥ సంకనయుండె చంటిబిడ్డకు జవలకోగమొస్తె । వూరివెలుపల పోలేరమ్మకు పొంగలినేబెడుదూ ॥ఏ॥ కోటలోయుండే ఇద్దరుమరుదులు గుండుతగిలిచస్తె కోటలోయుండే వీరబ్రహ్మముకు పొంగలినేచేస్తూ ॥ఏ॥ కాసికిపోయిన మాఅత్తగారు గడియలోపడిచస్తె । కాశిలోయుండే విశ్వనాధునకు అభిషేకముచేయిస్తూ ॥ఏ॥

### కురంజి — ఆది.

శివదీక్షా పరురాలనురాయేర ॥శివ॥ శీలమింతైనన్ విడువజాలనురానే శీల ॥శివ॥ శివశివగురునాజ్ఞ మీరనురానే శ్రీవైష్ణవుడంటే చేరనురా ॥శివ॥ వడిగవచ్చి మఠము చొరవకురా శివార్చనవేళ తలుపు తెరవకురా మడుగుదాన్ని శరగు ముట్టకురా । మాటిమాటికి నోరుమూయకురా.

### కామిక్.

ఓరోరిబండివాడా వగలమారిబండివాడ ॥ఓ॥ బండిమీద నాదిమోజు నిలుపరాబండివాడ ॥ఓ॥ నీవుపోయె బాటలోనె నిమ్మచెట్టున్నదిరా । నిమ్మచెట్టునీడకిర్రింద నిలువుటద్దమున్నదిరా ॥ఓ॥ గాజులంగాడికాడ పూవులంగడికాడ । తలుకున నీవుపోయి వుండాబ్రిబండి నటనిలుపరా ॥ఓ॥ చెవులో పోగుల్ దేర చేతిలోకి మురుగుల్ తేరా । కొప్పులోకి పూలుతేరా ఏమివద్దు పోరాసామి ॥ఓ॥ కట్టుకోనుకోకతేర పెట్టుకోను నగలుతేర లేకుంటే ఒద్దుపోరా వెంకటగిరినాసామి ॥ఓ॥

## తుంగల చలపతిరావుగారు, 'సక్కూబాయి' బెజవాడ.

అసావేరి.

జాగేలా కరుణాలవాల, ఈవిధిని నే నెటుల భరింపగలను ॥జా॥ ఖిల అనాథను పరీక్షించెదవా ఎరుగవా మది హేపరాత్పరా కటకటా హుకష్టంబయ్యెగా । గానము నేయుటకైన నోచనా ॥జా॥

మోహన — ఆది.

ఆటలాడుకోరా నాముద్దుల మాటగదరా గోపాల ॥నీ॥ గజ్జెలందియ ఘల్లుమల్లుమన గంతులువేయర గోపాల । బ్రాజనింప పాలారగించి నీ రళీగానము నేయరా నీ ॥వా॥ కనికరమింతయు లేక యశోదనిన్ కట్టినె వా నాతండ్రి అయ్యో కట్లువిప్పెదను పారిపోకుమా కన్నుల పండుగ లువరా నీ ॥వా॥ నందకుమార నవనీతచోరా బృందావనభువి సంచార ందమెల్ల నీసొమ్మర మామందిరముమ విడనాడకురా నీ ॥వా॥

బిలహరి.

గీ. వచ్చినాడవా నాతండ్రి! భక్తురాలి మొరను వీనుల బడింత ాదమలరగ వచ్చినాడవా । ఎన్నివిధముల బ్రతిమాల కన్నుగవను । జన్మ రియింప జేసితో చక్రధారీ.

పాట.

గోపాలకిృష్ణ విఠలే గోవిందకిృష్ణ విఠలే ॥గో॥
నాపాలిరంగ విఠలే శ్రీపాండురంగ విఠలే ॥గో॥

అసావేరి.

పరాకా! కరుణా సాగరా పల్కలే వినవేరా హా ॥ప॥ బాధలకోర బ్రతికించితివా పాండురంగా రంగా । పల్కవాదయుచిల్కవా ॥ప॥నీప ములనే పాడుకోతగనా నిత్యరూపా రంగా । నేరమా అపచారమా సరస రళీమోహనా జాలిదీర్పగలేవా ॥ప॥ జగధాదారుడ వీవేకాదా దారిలేదా గా స్వామివే సందేహమా జలజనయనా గోపాలా జాగు నేసెదవేలా॥

ముఖారి.

కదలీ రావిదిదూరమా భారమా గరుడ గమన బృందావనము ॥క
సదమలాంగ కరుణాంతరంగ నిన్నే నమ్మినాను ॥క॥ ముదమంది రాధముద్దు
పాటలకు నీ । మురళినంత సాగించితో । కరిని గాచిన కథల్ మరచితో
మొరవినవేల పురాణపురుష ॥కదలీ॥

రాదరి.

దాక్షిణ్యనిధీ దీనులపైతామసమా । పూరక వీక్షింతువిదేలా । రక్షకు
లింకెవ్వరురా రాధికలోలా ఆలస్యమికేలా ॥దా॥

సాకి — సాధుపరిత్రాత హేజీవదాత । క్షుద్వ్యాధమముగా కాల్చు
గదా కృష్ణా రక్షకులింకెవ్వరురా రాధికలోలా ఆలస్యమికేల ॥రా॥

పాట.

పుల్లకల్లు త్రాగనివాని జన్మమేల
పుడమిలోన అమృతమన్న నిదియే కదా ॥పు॥
యీసారాయి వసుధలోన అమృతమా
సేవింప జన్మ సార్థకమా
సానిసరస జేరితే సౌఖ్యమున్నదన్నా
మద్యపానము జేయని మనుజుడుండేలా
వ్యర్థ జీవియెగాక యీవసుధలోన ॥పు॥

పాట.

హరిభజనమె - జీవనమురా మనసా
పరమార్థము తెలిసిన మనుజాలకు ॥
నిరతము భిక్షా చరవరుడయ్యా
దరమునబోగ్రిమి వరదుడా వానికి ॥హరి॥
కనకపు సింహాసనమున నుంచిన
మనుజానికైనను మరణము దప్పునా
కనకనీపిప్రియు భక్తులబోగ్రిచగా
కనకపట్టధరుడే జనకుడా వానికి ॥

## పాట

ఏదీగతి నాకు రంగారంగా ॥ఏ॥ కరుణాభరణా కావగరాదే రంగా రంగా రంగ శ్రీరంగా ॥ఏ॥ తల్లియు తండ్రియు దైవము నీవే రంగా దాసు గావ దయానిధే దారిలేక నీదారి చేరితి తామసమేల శ్రీమనోనాథా ఏదీగతి నాకు॥

## పాట.

లేరా లేరా నిదురమానరా హరిజనవీరకుమారా!
మానవులే నిను మాలమాలయని దూరము చేసిరి కాదా
చాలుచాలు నీసంఘోన్నతికై దీక్షను బూనగరాదా ॥లే॥
గాంధిమహాత్ముని దీవెనలేడు ధర్మము నీదని చూడు
గట్టిగ నడుము కట్టిననిన్ను కాదనగలవారెవరూ ॥లే॥

## పాట.

మాలలు మాత్రము మనుజులు కారా భారతపుత్రులేరా
ఏడుకోట్లహరిజనులే తొలగిన ఏమగుమతమని కనరా
యీ భేదమేల సుజనులారా భేదమేల!
మాలనుకోసిన రక్తము రాదా నీలోనున్నది కాదా?
మానకోపములు అనురాగములు మాలకు కలుగవలేరా
సుందరభారత జననికి కాని యిట్టికళంకము తగునా
అటులోపముతో యికనీజగమున యే మొగమూచిన తగునా ॥భే॥

## పాట.

వేణుమనోహర గానము నేను వీలను నోచగ లేరా ॥వే॥
చూడనిసుమములమె యేడుగనోచును సుదతీమణియేమో ॥వే॥
జగముసర్వమును వెగటుగదోచును తాళలేను వకక్షణమైనా
మనోభావములు మనమున లయమూ మాటలు నోటను రావూ ॥వే॥
అనుభవరసము అంగనేని అంటము బ్రతుకేనా
అంటమన్నది నీకా లేకా అటమట గుమిలెదు నాకా ॥వే॥

## తాగుబోతుమగడు పాట.

నాకెందుకీకాపురంబు అమ్మ నాకు తగినోడు వొరికాడు తాగుబోతు మగడు ॥నా॥

కూలినాలికిపోడు కూడొండనున్నాడు కూడొండకున్న యింటి జాడు ఖూనిజేసియు వదలిపెట్టేడు ముక్కలున్న కూందెమ్మన్నాడు వంకున్న దుండగములికచూడు వీధిలోబెట్టి వేలమేసేడు తిండితినడు కుండలని తెగబగలకొడతాడు ॥నా॥

ఎద్దులాటిమనిషి మొద్దల్లమేపొద్దు నిద్దురపోయేడుచూడె పొద్దుడకముందుగను తాగినేడె తాగవద్దన్న శిరిమిగొట్టేడె కూటికి డబ్బులడిగి కోపించేడె కూలిపేరెత్తె రోగమన్నాడెతల్లి కూలినాలికిపోడు కూడు తెవన్నాడె ॥నాకెందు॥

అప్పొసప్పొజేసి యెవ్వడుయీలాగే తిప్పలుబడి వంటవొండ కుంమొయ్యతాగివచ్చి నెండ గిన్నె చెంతకుజేర్చును కుండ ఊర్పితినునంతయు నుండకుండ తిండితిని యూరకు మనా కుండవగులగొట్టివేయును నుండకుం యీతాగుబోతుకునాకు తగదెంక నేనుండ ॥నా॥

పొద్దుపొద్దునలేచి పుల్లలెల్లదెచ్చి కల్లుకర్చునకు వయ్యేడు కల్లుకమ్మకే చెల్లించేడు తెగతాగి దెబ్బలుతినివచ్చేడు దెబ్బలకు కట్లుగట్టమనాడు పగలురాతుర్లు బాధపడ్డాడు ఇట్లు తాగి తన్నులుతినె తాగుబోతు నామగడు ॥నా॥

తప్పతాగి గొప్పజెప్పతాడెప్పుడు అప్పుల న్నికప్పేతాడు కల్లుకైదరలుకల్పించేడు తల్లి కొరకుకొంపలను మాపేడు కూడదన్న కోపమును దేడు ఎప్పుడీలాగ యేడ్పించేడు తల్లి నిప్పుపై నిలకొట్టునీతిలేని నామగ నాకెందు కీకాపురంబు అమ్మ.

కల్లుతాగిమగడు కైపెక్కి వస్తేను, వళ్ళుకాళ్ళుపట్టలంట నీళ్ళు సినిద్దుర పుచ్చలంట బట్టలోవిరేచనము ఘాడనంట తీసివుతికి తిరిగికట్టు

వాంతియైన తీసివేయలంట కంపు ఇంపు చేసుకతిరుగలంట తల్లి దండమతనికి నాకుతగదెందుకు జంట ॥నా॥

అద్దరతిరికాడ నిద్దురలేనియు అన్న మని గట్టిగరచేడె లేవకున్నను తన్నిలేపేడె కుండెడైనసుతిని మరికునికేడె బాడిబందలో కండుకొనేడె శుద్ధిశుభ్రముని జూడబోడె అద్దుఃద్దులేకను బ్రతికేడె తల్లి తగదానిచెప్పితె తరిమి తరిమికొడతాడె ॥నా॥

## పాట.

ప్రేమసుధా మధు పానము శేయని
ప్రాణియె లేదీ జగతిన్
ప్రేమమూర్తియా పరమేశ్వరుడే
బోధపడె ప్రేమను మనలన్
ఇందకాష్ఠ మిదంకాష్ఠ నదీతీరేతిసంగమం
ఋణానుబంధ రూపేణ పశుపత్నిసుతాలయా
ప్రేమశూన్యమా జీవమేలా
దీపశూన్యమా దేహమెగాదా

## పాట.

మాధవా ఆధారమీవే-దీనజనమందార సాధుజనసంతాపహారీ
సకలలోకవిహారి శౌరీ ॥మాధవా॥

## పాట.

ముసలాడికీ మంచిముండ కావాలంట ॥మన॥
ముగ్గుబట్టతలతోటి మురిసేటి గిరిసేటి
కూకుంటె నెగలేవు—కూరాకు తేలేవు
అదిలేకుంటె వుండలేవు
వుండ నలుపుతావు—గెంటులాడుతావు
వంగి లేవలేవు ॥ముసలాడికి॥
వానిపొందు పసందు నేకందు జగమందు॥

## వుయ్యాల పాట.

అట్లతద్దివచ్చెను । నేనుయ్యాలు యెక్కెదాను బాగానువూగేదాను వుయ్యాలు నేనెక్కితె మాబావ నాకే బాగావూపుతాడు । కళ్ళు తిరిగిందాక వూపుతాడు । చెమట లెక్కిందాక వూపుతాడు వూపూపి తానులిసిపోయి నేనెక్కితా నీవూపమంటాడు ॥అ॥ నేను వూపూపి బాగావూపూపి యింక వొద్దోలెపిల్లా అన్నదాక । చాలు అన్నదాక యెగ్గు డెక్కినన్న దాక నేనూపుతాను ॥అ॥

## బి. యన్. ఆర్. రైల్వే స్ట్రయికుపాట.

బాబు! బి. యన్. ఆర్. రైల్వే స్ట్రయికట బాబు స్ట్రయికట రైల్వే స్ట్రయికట కంపెని స్ట్రయికట.

బాబు! తెల్లదొరలకొకజీతం నల్లదొరలకొకజీతం బాబు! మధ్య మన హిందువులకు తక్కువజీతాలుబాబు! అందుకు బి. యన్. ఆర్. రైల్వేస్ట్రయికటబాబు! బరంపురం వాస్తవ్యులు బారట్లా గిరిగారు కార్మికుల కష్టాలు కళ్ళార చూచినారు బాబు! కళ్ళార చూచినారు కంపెనీతోవారు కరస్పాండు చేసినారు వారు షరతులకొప్పకపోతే స్ట్రయికు చేయమన్నారు అందుకుబి. యన్. ఆర్. రైల్వేస్ట్రయికట బాబు! గార్డులంతా మరిజండా లెపూపినారు టిక్కెట్టు కలక్టర్లంతా పోర్టర్లందించినారు చిన్న మేష్టర్లంతా సిగనెళ్ళె లాగినారు బాబు ॥బి॥

## వెల్లంకి వెంకటేశ్వర్లుగారు, రాజమండ్రి.

హిం॥తోడి — ఆది.

శ్రీపతిరమణా దీనదయాలో పాతకహరణా పాలింపవేనన్ । భూపతినగునన్ యీగతిసేయుట పాపమదేమో పరమాత్మయెరుగన్ ॥శ్రీ॥ పరమపతివ్రతయగు సద్ధాంగిన్ వంశాంకురమా వరలెడు తనయున్ । సత్యదీక్షకై సాహసించినే పరులకమ్మితిని పాపాత్ముడనై ॥శ్రీ॥ అఖిలరాజ్యభోగాదులు విడినే కడకుకాటికాపరినవవలసెన్ మహినిజనించిన మానవతతికిన్ నడుటవ్రాత మాన్పగ విధితరమె ॥శ్రీ॥

## పాట.

నను గావనే తెంచినావా నాతండ్రి ॥న॥ మనోహరాకార దీనమందారాధరయోగ అనాథాళిపై నీకింత అన్యాయమేసెనా ॥న॥ కనుల్ పండువయ్యేగ నాదుకర్మల్ నశించెగ నాతండ్రి ॥న॥

## పాట.

నల్లవాడే గొల్లపిల్లవాడే కల్లగాదే వానివల్లో జిక్కితినే ॥న॥
వచ్చినాడే తోటజొచ్చినాడే అక్క సొచ్చినీదౌమనను
మురిపించినాడే ॥న॥
ఆడినాడే పొదల దాగినాడే నాదుమది తనరూపు
మీదసిలిపినాడే ॥న॥
వూదినాడే మురళిచేదినాడే మనసు రాగబంధముచేసి
లాగుకొన్నాడే ॥న॥
పాడుకుంటూ మాటలాడుకుంటూ నన్నుచూడరా దయయుంచు
వేడుకొంటూ ॥న॥

## పాట.

నిత్యల సత్యముతో జతగూర్చి నెంతశక్తివంతంబగు ప్రేమము ॥ని॥ దేవతలైనను దానిధాటికిని లోబడిపోవలసినవారే ॥ని॥

## కీ॥ శే॥ దొమ్మేటి సూర్యనారాయణగారు, 'రంగూన్ రౌడీ'

## కామిక్.

సీసా నాసీసా అయ్యో సీసా నాసీసా నువ్వులేకపోయెగాని వాసనైన లేకపోయె ॥సీ॥ బేసైనసీసా బల్ సోకైనసారా రాసగుంట తెచ్చియిచ్చె మోసపోయి యిడిసితిని ॥సీ॥ సారా నాసారా నువ్వులేకపోతెపోయెగాని నోకమెల్లమాయమాయె సోకులన్నిమీరి బల్ పాకలోనదూరి రాకరాక వచ్చినాను రూకలన్ని ఖర్చుమాయె.

## తీర్థంజంగాలుపాట.

మాలపిల్ల — వ॥ యావుండీ జంగమయ్యాగారుండీ డబ్బిత్తాను పొగుడు తారంటుండీ

జంగమయ్యా — వ॥ అయితే పిల్లా డబ్బిత్తెంచుకు పొగణ్తే.

పాట — మాదేవోహోమాదేవా కోటిపిల్లి సోమన్న, ద్రాక్షారామ భీమన్న, పట్టిసీమ యీరన్న, అంతిరేది నరసన్న, వాడపల్లి యెంకన్న, పొన్నాడా జగ్గప్ప వున్నాపాటిదేముళ్ళు వొచ్చిసాయమవ్వాలి, సల్లగానె జూడాలి, సంకజోలునిండాలి.

జంగమయ్యా — అయితే పిల్లా నీమొగుడు పేరేంపేరే.

మాలపిల్ల — వ॥ నామొగుడిపే రంకులుగాడుండీ, బాగాపొగుడుండి.

పాట — ఓరంకులో రంకులు దానికేయిర రంకులు తానమాడిందంకులు పోయినోడే జంగమ్మయ్యా పొగుడోడే దానిమొగుడు భ్రాంభ్రాంభ్రాం॥

### పాట.

నా మహిమ తెలియగలరా నాలీలలుకనగలరా నాధాటికోర్వగలరా ॥నా॥జగములనన్నిటి ప్రేమమయముగా చూపుచునుండునెడఎవరైనను ॥నా॥ అమరేంద్రాదులు ఆదిమూర్తినని జూపుచునుండెదఎవరికైనన్ ॥నా॥

### కామిక్.

ఇనరయ్యా సెపుతాను యివరముగ నొకయింత । ఇగ్గునేసు సెత్తిమీ దిభీశనుడు యెక్కినాడు ॥ఇ॥ సప్తసముద్రాలు సారాయికావాలి కాల్వలో నీరంతా కల్లయిపోవాలి । గుండామీద బండిపార బండి రెండు చెక్కలా యెర బావా గుభీగుభీ । నగజనమరి నభిజనమరి చిత్తోపకొ్క॥

శాత్రిపురండాలూ చదివిన యీబాపనోరు ఏదీ నాతో పేలమను కల్లు తాగమను గుండామీద బండిపార బండిరెండు చెక్కలాయెర బావా గుభీ గుభీ నభీజనమరి నభిజనమరి చిత్తోపకొ్క యెడవకల్లు పోతే పోనాదిగాని అప్పయితే అయిందిసివ్వంటి సారాతాగమన్నాడు శాత్రికారుడు మకిటి రాసోళ్ళగుంటతెచ్చి యిచ్చినసారాయి యెర్రిగ పందిసెత్తురునాగుంటతే మనూర్దాని......ఓసిదేటే వుట్టొదిలాడిపోనాద...అఅ॥

### పాట.

బలమా బ్రిహ్మచారి సూన పడీ మేరీ ఫులవారిబలమా
సారె తారె ఖిలె చన్దాబోవమిలె రాత్ సూనీహీ రహే
నీర నైనోఁ సే బహే బలమా కౌన్ సునె దిల్ కి బతియాఁ
భరీ జవానీకే రతియాఁ యూఁహీ గుజర గుజరె (బలమా)

### పాట.

బలమా బ్రిహ్మచారి తాజా హుఆ మేరీ ఫులవారీ బలమా
మైనోఁ దేఖూఁ ఖడీ కబ్ ఓ ఆమే ఘుడీ శ్యామ ఘూమె బంసరీ
భీజలాయె
చూడకి బలమా బ్రిహ్మచారి.

### సిరిసిరి మువ్వ పాట.

జోడుకొయ్యాలవాడమీదా సిరిసిరిమువ్వా
జోడగ్గిపెట్టిలంపినాను సిరిసిరిమువ్వా
అందింకోఅందలేదో సిరిసిరిమువ్వా
నాకు తిరుగుటపా రాలేదు సిరిసిరిమువ్వా
సింగపూరుమోడమీదా సిరిసిరి బర్ రంగుచీరలంపినాను సిరిసిరి
ఓడమునిగిపోయిందంటూ సిరిసిరి నా కుత్తరాలు రాశారో సిరిసిరి
రంగూనులాభాలు సిరిసిరి అమ్యో గంగపాలుజేశాను సిరిసిరి
సిల్కుచీరగట్టి సిరిసిరి నీతో కులుకుదామనుకుంటి సిరిసిరి
మోటారుకారుమీదా సిరిసిరి నా మోజులాపాలనుకుంటి సిరిసిరి
అద్దాలమేడలో నా సిరిసిరి నీతో ముద్దులాడ్దామనుకుంటి సిరిసిరి
కానికాలమూటచేతా సిరిసిరి నా కళ్ళుచూముకొన్నాయి సిరి...
రంగూనుగుండ సుండా ... నను గంగుజేసి పిలిపించి ...
అద్దాలమేడలో నా ... నను ముద్దులాడిమురిపించి ...
రమ్మసారాతాగించి ... నా సొమ్మంతకాజేసి ...

చెప్పరానిరోగాలూ ... నా కొప్పజెప్పిపోయిందీ ...
కూడుగుడ్డకరువయ్యే ... నాకు తోడునీడలేదయ్యే ...
వైద్యుడొచ్చి మందిచ్చీ ... నామచ్చ మాపుతున్నాడు ...
రంగూనుమాహాత్మ్యం సిరిసిరిమువ్వ యీభంగపాటు దెచ్చినది
సిరిసిరిమువ్వా

## అపనాతనామనాపాట.

ఇంటిముందు యీతపొద యింటివెనక గచ్చపొద
ఒంటిగానురాబోకు యుక్కులజిక్కి పోదువురా ॥అప॥
అత్తగారి కత్తికోత ఆడబిడ్డపెట్టుపోత
చిత్తకార్తికుక్కలయ్యే స్నేహమెట్లుచేసెదరా ॥అప॥
గుమ్మమైనదాటనీరు గుసగుసల్ చేయనీరు
కాటికాడనక్కవోలె కాచియుంను రెల్లపుడు
రాత్రిరెండుజాములకు రావిచెట్టుక్రిందనుండు
యింటివారిని నిద్రబుచ్చి యెట్లోనిన్ను గలసెదరా ॥అప॥
వచ్చిపోయెదారిలోను పిచ్చికుక్కలున్నవిరా
మచ్చుజల్లి పోయెదరు మాయలవడీ పోకుమురా ॥అప॥
నీకునాకుజోడుగాన నిమ్మపూలతెప్పమీద
తేలిపోవ మనసుబుట్టె తెల్లవారు టెప్పుడురా ॥అప॥
ఎప్పుడిల్లు విడిచెదనో యెపుడునిన్ను గూడెదనో
చిత్తమూ చెదిరిపోయె కత్తికోత బలమాయె ॥అప॥
అందగాడ వాటనీను పొందుగోరి యున్నదాన
యెట్టులైన యింటనుండి లేచివత్తుకొనిపోర ॥అప॥

## పాట.

మాధవదరిసెనమీరా రారా ఆడేవీలో పాడెదరా నే ॥మా॥
వరాకా కనరా నామొరా వినరా కన్నులవిందుగ గనరారా ॥మా॥

## పాట.

యశోదానందన దీనశరణ్యా గోపీమనోహర శౌరీ
నీదయలేకా నిలువగలరే దేవాదిదేవులు గానీ
హేయోగానందా మాధవా రాసలీలా లోలా
రాధాప్రియాధారా గీతాబోధా మోహా
నీపదభజనా నాకొసంగుము జలజనయనా శౌరి ॥యశోదా॥

## పాట.

మాయావిలాసినులూ మాయావి ధనికులూ
ఉన్నంతకాల మిలా నాకేమికొరత
నన్జూచి నవ్వినను నాకేమికొరత ॥మా యా॥

## పాట.

సగమురాతిరి అయ్యేనే జగము కన్నులుమూసెనే రాధా
కానవా పూనవా కరుణను ॥సగము రాతిరి॥
రోహిణి కలలోని కోదనా మామ కంసోయిలో వేసనా
నీదు ప్రియురాలి తీక్షైనచూపుల తాపము బాపగ రావా
మరచితే విడచితె ప్రియవిభో ॥సగము॥

## పాట.

బాధాసహనమేసతీత్వము బాధా సహనమే
బాధలనోర్చి సాధనచేసీ సంసారాంబుధి నీదినవారే
ఆతారకమా కీర్తిగాంచిరి ॥బాధా॥
శైలకుమారీ సుమతీబృందా నాథునిసేవా మహిమచేకాదా
సౌఖ్యము చెందిలా ॥బాధా॥
ఎంతటి బాధలు గురికానీ ప్రాణమైనపోవలసిన పోనీ
భారతసతికి సాధునిసేవధర్మము ॥బాధా॥

పాట.

కానరా మానరా హింసానూనర బలులచేత భోగములీయగ
బోదేనాదూ ॥కానరా మానరా॥
కానరాభక్తి కనరాముక్తి నుమహితభజనమె
శోభనదాయి ॥కానరా మానరా॥

పాట.

తనువశాశ్వతము నమ్మబోకుడీ దైవభజనము చేయుండీ ॥త॥
మోక్షమొందుటకు మురహరిస్మరణమే
ముఖ్యసాధనము జనులారా ॥తనువుసాశ్వతము॥
జగంబు నిత్యమా సుఖంబు సత్యమా భ్రమయే సుమ్మా ॥త॥

పాట.

గాంధీమహాత్ము విసేనా మనకు కన్నులార గనత్రోవా ॥గాంధీ॥
ఆర్యులార మీరురండీ తమ ఓపికతో చూడండీ
ఈకాంగ్రెసువారిసేవ మనకన్ని మార్గములత్రోవ ॥గాంధీ॥
భక్తులార మీరురండీ తమశ్రద్ధతో చూడండీ
ఈపనుపుపెట్టి మహాత్మ్యంబు దీనిపరమార్థము గనుగొనుడీ ॥గాం॥
జనులార వేగరండీ ముక్తిమార్గముకై చూడండీ
ఈపనుపుపెట్టి వెతకండీ తమఓట్లను దయచేయండీ ॥గాంధీ॥

పాట.

కన్నులార మీరుగనుడీ జనులార కాంగ్రెసువారినేగనుడీ ॥క॥
ఎన్నిబాధలైన సైచి జనులారా శాంతిమార్గము కనుగొనుడీ
ఎన్నికష్టములైన సైచిసైచీమీరు మెల్లగా చివరకు
ముక్తిమార్గము గనుడీ కాలమేగతిగడువనున్నదీ జనులార
కష్టించి ఫలిత మొకకండీ తప్పతాగెడి వారితోను జనులార

తలలూపి పాటుపడకండీ ఎన్నిబాధములనైన
ఏమార్గమునవైన కాంగ్రెసువారితో కలసి పనిచెయ్యండి ॥క॥
భరతమాతా పుత్రులారా మీరంత పనుపూపెట్టైను చూపరండీ
ఒప్పుగా మీరంత ఏకీభవముతోను
తప్పక తమఓట్లు కాంగ్రెస్సుకివ్వండి ॥క॥

## పాట.

ప్రేమమె మధనమూ ప్రేమమే శాంతీ
ప్రేమమె భవతారకమూ ప్రేమపూజ చేయువారే
సౌఖ్యభూమిపాలకులూ మానసముల నూదిన ప్రేమా
లభించు నేకళా ॥ప్రేమమె॥

## పాట.

రాధా! అభాగ్యసోదరీ! ఇటులైతివా
నీకు సుఖమేసదా గగనమునను గానా దుర్వ్యధీ వేశికంటా
గనియేగదా వాపోవ వలమేమి ధైర్యమూనుమా
సుఖదాయి హరిసేవ మరిగొనుమా మంగళకరనీపదభజనా
బహుళవినతజనసుఖదమునా భవ
భవదమలచరణ మధుకతులకు నీ కరుణాలవమిడవా
తోడ్పడవా రాధా సనాధ మాధవా॥

## పాట.

జయజయ మహాత్మగాంధిజీ హే భరతభాగ్య విధాయీ
పతితపాలా ప్రేమశీలా హరిజనాధరుదాతా ॥జయ॥
నీపదాంకములంటి నడువా జయము కొంగునమూట కాదా
నతజనబాధాపహారి నిజము నీపదసేవా ॥జయ॥

## కామిక్.

బండెక్కమామా మే డెక్కమామా ఎక్కమామా
బండెక్కమామా ఎక్కుతుంది ఎక్కుతుంది॥

## పాట.

పందెమిడిన యీపాపిని పటాపంచలుగజేసెద ఆహా ఆహా యింత క్రూరకార్య మెందయిన గలదే ఆహా ఆహా ఆకరమును ఖండించెద ఆభుజమును దండించెద ఆమణిబంధము ద్రెంచెద ఆహా పావనశుభచరితా నిరత వంశ్య సుగుణభరిత ఆద్రొపతినిన్ గనగా మాయేవ్వరికి న్నెలతా ॥ఆ॥

## రవికపాట — డైలాగ్.

అత్తవారింటికీ కొత్తగావెళ్ళాలి। గుత్తముగ నారైక కుట్టాలీ। నే వస్తాను సందాలకీయాలీ ॥అ॥ కొత్తసాగలగుడ్డ కొనితెచ్చుకున్నాను। కొలపెట్టి అందముగ కుట్టాలీ। నాగాదులు బిగువూలేక కుదరాలి ॥అ॥ సంకలూ వొదులెట్టి సారమట్టూబెట్టి సన్నసూదీ యెరగ్రిదారాలూ చిన్నవన్నెలుపు వ్వేయాలి ॥అ॥ మడతచిన్నదిశెట్టి। పదునుపేపనుబెట్టి తొడిగి తీసినగాని సడలకుండుండాలి। తడిసినాకుట్లు విడకుండాలి। ముడికెదుర. కుక్షియెడమ నొక్కాలి ॥అ॥ నడుముపటకాబెట్టి। మెడకుబొత్తామెట్టి। ముడివేసినారైక తొడిగిసూపించితే తోటోళ్ళు మెచ్చాలి। తొలిపట్టు సులువుగా యెక్కాలీ। తోడ తానేమనను దీరాలి ॥అ॥

## కల్లుపాట — పడవపాటవరుస.

హాయి గ.నున్నాది ఆనందమైనాది ॥హా॥ మాతల్లిచెల్లమ్మ మంచికల్లోశింది ॥హా॥ కలుషలేని కల్లులోకి కాంతసీకు నంజుకొంటె సలుపుకంటె జొలూ। చెల్లమ్మపిడతలోకల్లు ॥హా॥ కల్లంటె తాటికల్లు కల్లంటె కట్టకల్లు కల్లంటె పొంగునొల్లు వాకడుపునిండు కడవకల్లు తప్పకుండతాగి పేరుచెప్పుకుంట పోవాలి యెప్పుడొచ్చినగాని యీయమ్మపొయ్యాలి ॥హా॥

## జె. శ్రీరామమూర్తి భాగవతులు, విజయనగరము.

## బస్సు పాట.

వచనం—దొడ్డమ్మగారూ బస్సు ఎక్కుతారా?

వచనం—బాబూ నడచి వెళ్ళిపోతే మీబస్సుకన్నా ముందు వెళ్ళిపోతానురా నాయనా,

పాట—బస్సుపుట్టి దొరిబాబు బస్సుపుట్టింది యీబస్సుపుట్టి బళ్ళ వాళ్ళ కడుపుకొట్టిందోరిబాబు ॥బ॥ ఒంటెద్దుబండిపోయె రెండెడ్లబండిపో యె డబ్బుపోయె మనకు యిబ్బందిలావయ్యె ॥బ॥ కాళ్ళుజాచవీలుకాదు ఖైదీ వలె కూర్చొవలె కడుపుబ్బినావీరు యిదియావరోయ్ బాబు ॥బ॥ పిల్లవాని పెళ్ళికి నేపార్కోండపోవుచుండ పాతడ్రైవరు పేలగానె వెనకతిరిగి రాలేక ముందుకుమరి పోలేక ఎండబాధపడలేక చెట్టునీడకిక్రింద నేను చల్లగాను కూరుచుంటి తోవమధ్యస్థంలో తొయ్యి తొయ్యి మన్నారు బాబు ॥బ॥ చదువునక్కరలేదు చాకలి పోతనచేతిలో స్టీరింగొక్కటి యె బాబు వారికి రాముడుకొడుకు బస్సుడ్రైవరే మంగలి వెంకిగాని కొడుకు మోటారుడ్రైవ రోయిబాబు ॥బ॥

డ్రైవర్లుదోపిడి కండక్టర్లుదోపిడి కడను క్లీనర్లుకూడ కక్కుర్తిపాలే ॥బ॥ బస్సుకొచ్చినసొమ్ము పోలీసువారిపాలు లైసెన్సులపాలు మధ్యమధ్య ఖైర్లపాలు మరామత్తులపాలు తుదకు ఓనర్లంతా దేశాలపాలు ॥బ॥

ఓనరుచుట్టాలు పోలీసువారిచుట్టాలు తాసీల్దారుచుట్టాలు యింతమం దిచుట్టుకుంటె బస్సుఓనర్లంతా భిక్షెత్తుకోవడమె ॥బ॥

## గోదావరి పుష్కరాలపాట.

వచనం—సుబ్బప్పా గోదావరిపుష్కరాలికి వెళ్ళవ్రుటే!

వెళ్ళెను దొడ్డమ్మా అయితే నాతోను చెప్పేనాచెప్పేవు కావేమి? ఏమిటి ఆపుష్కరాలవింతలు ఏమివింతలు దొడ్డమ్మా చెప్పితే నమ్మవుకాని.

పాట—గోదావరి పుష్కరాలవింతలు దొడ్డమ్మా ॥గో॥ నేనీగొప్ప గ్రామఫోనువారు కోరబంపితి దొడ్డమ్మా ॥గో॥

నున్నటిగుండుమీద సైనుపంచె గూబసందులకుదించి కునికిపాట్లుపడ కుండ కూర్చొని వినె దొడ్డమ్మా ॥గో॥ గోదావరి పుష్కరాలు చూదామని పోతుంటె వ్యాధులంటకుండ మందుసాధనచేయిస్తవని మందుసూది గుచ్చి

నాడే మునిసిపల్లి మొనగాడు అమ్మయ్యో అమ్మయ్యో సూదిపోటు గుండె మొయ్య నాటిపోయిందె దొడ్డమ్మా ॥గో॥

ఉదయాన గోదావరి నదిలోన స్నానమాడి ముదముతో కోటిలింగా లు ముఖ్యంగా సేవిస్తే తాతముత్తాతలందరు తరియిస్తారనుకొని పస్తులుగా గట్టోడుండ భక్తితోడ మొక్కుతుంటె అదిగది గదిగదుగో గదలెదురింగాలు గంపెడు కనపడ్డాయి దొడ్డమ్మా ॥గో॥

గోదావరితీరమున కోటిలింగాలి రేవులోన కొడుకులుపుట్టాలని కోరి స్నానమాడుతుంటె కొత్తనీటికుసుములకు కోకచెంగు బురదలకు వెనకముందు తోరిపులకు కుచ్చెళ్ళకుసుములకు అమ్మయ్యో కొప్పులోని కొత్తసవర కొట్టు కుపోయిందే దొడ్డమ్మా ॥గో॥

## జామిపళ్లుపాట — డైలాగ్.

నర్సమ్మ—పళ్ళమ్మవచ్చేను పళ్ళో మంచి పరువుకొచ్చిన జామి పళ్ళో ॥ప॥ పళ్ళుకావలిసున్న కళ్ళతోడ నెజూసి కాళ్ళదగ్గరకొచ్చి కానిస్తె రెండిస్త ॥ప॥

రంగడు—పరువైన పళ్ళయితె కొంటాను నేను పట్టినొక్కిచూసు కుంటాను అరువుబేరముగాదు అమ్మోరుకెట్టాలి వురవజూడగనిమ్మ వుండు పారొత్తున్న ॥ప॥

నర్సమ్మ—చెంగుచాటున కప్పికుంచేనూ నేను చేతపట్టి చూడ నివ్వాను వొంగిపోవును ముచ్చికొదురు గట్టిగలేదు రంగుమారిన యెవరు రారు మోజాబోవు ॥చెం॥

రంగడు—చూడకుండెవ్వరైన కొంటారా చేతసామ్ము వూరికె వదలి పెడతారా ఆడదానవు వీధి నమ్మకోవచ్చేవు వాడిపోకుండేని వదలాను సూసుకొని ॥చూడ॥

వర్సమ్మ—గోరుగుచ్చి చూడనివ్వాను పైని కొసరులేదు పిసలు జెప్పేనూ మారుమాటాడితే మర్యాదదక్కదూ పళ్ళుపై చెయ్యేస్తె పళ్ళూడి పోతాయి పక్కనుండి మాటలాడాలి పరువుతప్పకుండ అమ్మాలీ ॥గో॥

రంగడు—బెట్టుసరిబేరాలు జెప్పేవూ పళ్ళు ముట్టుకుంటే యిదిపి కొట్టేవు కొట్టుకాడికిరమ్మ కోరినా డబ్బిస్త పట్టుకుంటే చెయ్యి నిండాలీ నీపళ్ళు నేనే యనుభవించాలీ॥

చెరుకుతోట పాట.

వచనం—ఓలి పోలప్ప యీయాట నీభూమి యాలాపండిందో సూసినావా.

పాట—నీదిబాగుండె బుచ్చెప్ప చెరుకుతోట, నీదిబాగుండె నీదిబా గుండె, బుచ్చప్ప చెరుకుతోట ॥నీది॥ పన్నెవన్నెలకర్రి రంగురంగులకర్రి, గుంపుగుంపులకర్రి కలిసి బలిసి ఎదిగినకర్రి భూమికితగ్గఃర్రి, బాగానా టిందె, బాగాబలిసిందె, ఓలప్ప నీకేటి మాకి సాగుబడి చేసేవాళ్ళు సల్లా గుండాలకాని నీదిబాగుండె బుచ్చప్ప చెరుకుతోట,

ఎన్నోనోములునోసి ఎన్నోవ్రతములుజేసి, యీయింటపడ్డావు, డబ్బు గలిగివున్నాది ఇబ్బందిలేకుండ ఏలాగైనా నీకు ఎల్లిపోతాదప్ప కాలము ఎల్లీపోతాదప్ప మామబావచాల మక్కువయివున్నారు మంచి మక్కువయి యున్నారు ముద్దుబిడ్డాలాగ చూచుకుంటున్నారు ఇల్లుకదలి నిన్ను ఎల్లనీయ కుండ కాసింతయైనాను కష్టానష్టాకుండ కూసుండబెట్టిసికు కుసురుగ పెడ తున్నారు కూడు కుసురుగపెడతున్నారు, పరాయివాళ్ళ అవసరము పిస రయినలేకుండ, వున్నా నీఒక్కాదకీచాలా ఓపికతోజేస్తుంటే సాగుబడి ఓపికతోవేస్తుంటే బాగుండదు, నీది బాగుండదు తోటబాగుండదు చెరుకు తోట బాగుండదు, ఎందోలె బాగుండదు ఓలప్పా ఏనుగులాటోళ్ళు నీకు యిద్దరు కలిసుండబట్టి, ఓలప్పా యిద్దరుకలిసుండబట్టి ॥నీది॥

వచనం—ఓలప్పా నీగుసాగుసాలు ఆడుతావని నాకు తెలుసుమనేయే నీభూమిమాత్రము బాగపండ నేదేటి నాభూమి యేలాపండిందో చెప్పయ వినవే.

పాట—ముండమనువువచ్చానే, ముద్దుముచ్చట లేదె యే కముండు చూపు ఎవ్వరులేందప్ప దన్ను ఎవ్వరులేరప్ప, ఉన్నావాడు ఒక్కడే, వోటోడైపోనాడే ముండబాటోడైపోనాడే ఎట్టకెప్పుడైనా, ఎక్కుతాడో లప్ప ఏతాం యెక్కుతాడోలప్ప ముమ్మారితొక్కుతాడు అప్పా ఓలప్పా ముడుకలు నొప్పంటాడు నడుమునొప్పి అంటాడు, కాళ్ళుతీతంటాడు, మాటన్నమాటలేదు నాగలి మాటలేదు తవ్వన్నతవ్వలేదు గొప్పు తవ్వన్న తవ్వలేదు, అందుకే మూడేళ్ళనుంచిభూమి మేసెనుపోనాది నాది మేటే సుకుపోనాది మేట యేసుకపోనాది ॥నీ॥

వచనం—ఓలప్ప తరువాత యేటన్నావో చూచి[illegible]వా.

పాట—రామగాడ్ని నమ్మి కయితరకమిస్తేని దానికుండాలని దీని కుండాలని ముండగండ డప్పా మూడొండ లందుకోని తప్పతాగుకొని, గొబ్బొళ్ళు కోడలైన దిబ్బసూరికాడ కూకుండెవోడప్ప వూసులాడుకొంటు కూకుండెవాడప్ప కానిక్కట్టుమనొకనాడైన పనిచేసినాడుగాడు ఓలప్ప నీ కెందుకంటాడు చేతగానిదంటాడు చవిటిభూమియంటాడు నాది చవిటి భూమంటాడు, నీది గొడ్డుభూమిఅంటాడు ॥నీ॥

వెనక రామిగాడైనాడు గవిరిగాడైనాడు ఇంతమంది అయినారు ఓలప్ప అప్ప యింతమందైనారు ఏమిలాభమప్ప ఆయారునెలలెట్లొ ఆకితో నైనాది ఆడితోపడ్డాను గండం ముచ్చటికైనా మొక్క మొలిపించినారు కారు (నీ॥బాగుం) కాపరానికొచ్చాను కడుపునిండినపంట కళ్లారచూడ లేదు ॥నీ॥

పాట.

లెండు భారతవీరులారా, నిదురలేవండోయి బాబూ కల్లుమానండీ ॥లెండు॥ బాబూ కల్లుతెరవండీ॥ కడువా కూడు తోడుగా వలువా లేనీ పిల్లల గోడూచూచి నిలువనీరా సతిసిగాంచి తాగకండి మీరు తాగే కల్లదికాదే రక్తముసుండి ॥లె.॥ బీదలపీల్చితివే మహామారి ప్రభువుల కాల్చు కునే పింజారి, దేశదారిద్రిత లేదాదాకీ పాపపిశాచము పారద్రోలి భారత కీర్తిని నిల్పగరండు ॥లెం॥

## పందేగాళ్ళపాట — బొబ్బిలిపాటవరుస.

సంకురాత్రిరీ పండుగొచ్చెరా సర్దుడిమద్గాలం సంకట్టెట్టరా కోడిపుంజుని సాగునుపందాలు ॥సం॥ నేతగాళ్ళు కందేతగాళ్ళు గవ్వేతగాళ్ళు మన పందేగాళ్ళకు జాతిలోదిరా పూలకోడి మాసవాలా మీాదొొదులూ పాతిక యాభై కలుపుదాామురా పందెమురెట్టింపు యీతలాతలాపుంజులవసలీ చేత డబ్బబెట్ట తన్నుపైని తన్నెగిరితన్నెరా వన్నెపూలకోడిపోటుపైన పోటెత్తి పొడిచెరా సూటిగాను సవలాయేటూ దప్పెరా కాటూదప్పెరా యెత్తర నీళ్ళాళ్ళు ॥సం॥ యీారేసో మల్లేసో అందేవల్లయపంది మొడిసితె ఓంది సిందెరా రూపాయిల్ బిందిలోయి చదివంపులుదీసి బందరుబోదముబసవన్న యీారేసెల్లి యీాద్దులొబడితే దెబ్బతగిలెరా మల్లయకు మల్లయ్యోల్లీ మడుగులొదిగితే జెల్లగొట్టెరా శివలింగం శివలింగమెల్లి చింతలెక్కితే సీమగుట్టెరా పెరుమాళ్ళు పెరుమాళ్ళెల్లి పేడదీసితే యెద్దునొక్కెరా బసవయ్యానీ బసవయ్యోల్లీ పందెముగడితే అసలే వోడెను సవలాని ॥యీా॥

## కోలాటంపాట.

ఓచిన్నదాన విడువనెకొంగు మరొడలనె కొంగు ॥ఓ॥
బంగరుచిన్నదాన శాజాబందులదాన
శాజాబందులమీాద మోజెంతలేదే ॥ఓ॥
అల్లూమల్లూరికాడ కల్లూబజారికాడ
కల్లూంబజారికాడ కలసిందె మనసు ॥ఓ॥
ఎర్రెఎర్రానిదాన ఎత్తుపిరుదులదాన
ఎత్తుపిరుదులమీాద ఎండిమువ్వలేమే ॥ఓ॥
గుంటూరుచిన్నదాన గులుకుమట్టెలదాన
గులుకుమట్టెలమీాద గురగురమంటాదే ॥ఓ॥
నల్లనల్లనిదాన నడుముసన్ననిదాన
నడుముసన్నమీాద నల్లకోకసోకే ॥ఓ॥

# గ్రామఘోషపాటలు.

## పచ్చబొట్టుపాట — డైలాగ్.

బావ పచ్చబొట్టు పొడిపించుబావ (బావ)
పావలాపరకయిచ్చి పొడిపించుబావ (బావ)
ఏమేటిపచ్చబొట్టు పొడిపించమంటావే
ఏమేటికావలెనమ్మా నరసమ్మా
నీకేమేటికావలెనమ్మా నరసమ్మా
బావ, బావ అప్పన్నకొండొకటి! కొండమీద
గుడియొకటి గుడిముందు గంటలతో గరుడస్తంభం
యొకటి, అడివారం చెరువొకటి యాదరబకోవిలొకటి
వాచేతిమీద పొడిపించుబావ ॥బా॥
ఏమేటి పచ్చబొట్టు పొడిపించమంటావే
నీకేమేటి కావలెనమ్మా, నరసమ్మా
బావ అరిమల్లి బొడ్డుమల్లి సిరుమల్లి వరుమల్లి
శ్రీరామపాదాలు, సీతమ్మ సవరాలు,
లచ్చన్నబాణాలు, హనుమంతువాలాలు, ఆబరణాదుప్పులు
తొడలపైని పొడిపించుబావ ॥బావ॥
అయితే బావ, నేనప్పుడేలాగున నుంటానంటే
కోమటోడింటికెళ్ళి, కోవిరినూని రాసుకొని
బుక్కావాడింటికెళ్ళి, బొట్టుకాటుకెట్టుకుని
గాజులోడింటికెళ్ళి పూలగాజులేసుకుని, అప్పుడుసూసుకో
బాగాసూసుకో అందం, గాజులేబాగుంటాయో,
బొట్టెబాగుంటాదో, చీరెబాగుంటాదో,
నానే బాగుంటానో, నువ్వే బాగుంటావో
వయిదే లాగుంటాదో, అప్పుడు సూసుకో
బాగాసూసుకో అందం, బాగాసూసుకో అందం,
అప్పుడు నిబద్దిగా చెప్పవోయి కరెంకట బావ॥

## తెలుకులజిడ్డుపాట.

నూకాలమ్మ సంబరమునాడు మదుముమీద కూర్చుంటె
మాయిదారిగాలొచ్చి మదుములో బడకోసెనోయి
తెలుకులనూకమ్మ నన్ను మదుములబడదోసెనోయి
తెలుకులోలజిడ్డు
పడితె పడ్డానుగాని యిరుగుతోను చెప్పకుండ
పొరుగుతోను చెప్పకుండ ఎవరితోను చెప్పకుండ
నీమననులుంచిదానుమా తెలుకులనూకమ్మ॥
వెంకటస్వామి అలసిపోయి అరపమీద తొంగుంటె
ఆడి మొలనున్న ముప్పయయిరూపాయిలు యిప్పకొని దొబ్బి
అది సంతంత సైరుజేసి సంగిడంత ఇప్పి
దానికొప్పులెట్టి ముడుసునా ముప్పయిరూపాయిలు,
దానికొప్పులెట్టి దాచునా ముప్పయిరూపాయిలు
వెంకటస్వామి లెగిసినాడు బలేబలే నూకమ్మ
తెలుకులోళ్లపిల్ల నా మొలనున్న ముప్పయిరూపాయిలు
యిప్పితే యిప్పేవుగాని ఎవడిపాలు జేసితివే
ముప్పయిరూపాయిలు నీవు నిబద్దీగా చెప్పుమా
ముప్పయిరూపాయిలు॥
బావా యిరుగువారితోడు, పొరుగువారితోడు,
కల్లాకాటికితోడు, కన్నవారితోడు,
నాయింటిమగనితోడు, ఈరభద్రుడుతోడు
నాసంకాబిడ్డాతోడు, రంకుమగనితోడు
నేనెరగనోయిబావా నీముప్పయిరూపాయిలు॥
కోపగించి వెంకటస్వామి సవరాల దానికొప్పు
సాగదీసిపట్టి ఆడికాలికొచ్చినతన్ను
ఆడిచేతికొచ్చినగుద్దు మూడుగుద్దులు గుద్దగనే

గల్లున రాలెనా ముప్పయిరూపాయిలు॥
అయిదురూపాయిలు తీసినాడు, మేపరోలముదుముతిరిగి
ఏరాడప్పయ్యా ఏరుదాటి కోరాడప్పయ్యా పోకదోలి
నకటిన్నర సారాదాగి చుట్టుదిరిగి చెరువుదగ్గరకొచ్చి
వెంకటసామి విజయనగరము ఏట్రిలోను
రెండుచేతులు కడుగుతుంటె నేనిచ్చిన రెండ్రిసెలు......॥

## తీండ్రింపాట.

తీండ్రిమెల్లొస్తాను తల్లిలచ్చుమ్మప్ప। చల్దికూడట్టుకొని సాగెల్తాను॥ ఓలే! వొడపప్పుకొంతాను కొబ్బరుండలు దెత్తాను కడియాలుదెత్తాను కాళ్ళ కునీకోతె। ఎల్లుతావుగాని ఏం జాగరతమ్మి। కన్నూమూసినావంటె కమ్మ లుతెంపుతారు। పైటబిగ్గట్టుకోని పరిజలలో కెల్లమ్మి। చాటునున్న కంగరోళు సంకలో చెయ్యెడతారు। ఎనక నేనొకసారి ఎల్లినానాతీర్థం సన్నసన్నగొక గండ డనరాని పనిచేసె। చూడు గడును నచ్చుమ్మి కూడుతుంది తీర్థమిప్పు డు॥ ఏడజూచినగాని యీనేత్తువ్నారుపెబ॥చూ॥ ముండబావనోళ్ళు వుం డనీయకాకాసి।దచ్చినాలు తెమ్మని దండట్టుకు నాగుతారు॥మా॥ జంగపో ల్లొకాకాసి లింగకాయ ఎగరేసి తానాలు చెయ్యమని తలాడ మెడతారు॥

## పా ట.

నెరానెరా నెరబండి నెలవరదనడో ॥నె॥
అన్పునప్పుజేసి అరిసెలు నేనొండితె
పైతొక్కలేదని పక్కలొతన్నేడే ॥నె॥
నిన్నురమ్మన్నాది నన్నురమ్మన్నాది
యిద్దరిని రమ్మని నిద్దరోయిందో ॥నె॥
అప్పుసప్పుచేసి బూరిలొండి పెడితేను
పూర్ణములేదాని పూనిగుద్దేడో ॥నె॥
మూడుపైసాలెట్టి తాటిపండు నేకొంటె
పేసములేదాని కేసూకెళ్ళేడో ॥నె॥

ఆయీదికుర్రోఁడు యీయీఁకొచ్చాడు
అద్దాంమేడలో అద్దెకున్నాడో ॥నె॥
మూడురూపాయలెట్టి దుద్దులు నేకొంటె
బొక్కాలులేవని బిక్కొక్కెల్లేడే ॥నె॥
మూడుపావలాలెట్టి చొక్కా నేకుట్టిస్తె
జీరలు లేవని జీవనమొదిలేడే ॥నె॥
అయిదురూపాయిలెట్టి పంచెలు నేకొంటె
అంచులు లేవాని అణవిగుద్దేడె ॥నె॥
సంకలోపిల్లోన్ని డొంకలోపారేసి
మొగలిపూవువాసనకి మొగుడికెళ్ళిందె ॥నె॥
సర్దాగ నామరది సైకిలుకొంటేను
మొరకీధిభవనంకాడ సతికెలబడ్డాడె ॥నె॥
అల్లయీల్లపున్నాన్ని అబ్బాయిపుడితేను
మామపేరుపెట్టమని మండిపడ్డాడె ॥నె॥
ఆమంట యీమంట తాటేకుల దడిమంట
ఏమంటలేకపోతె నాయెంట రారో ॥నె॥
సోమదారునామరది సానింటికెళ్తేను
మడతమంచం దెబ్బలకి మణిగిపోయేడే ॥నె॥
అయిమువందలుపెట్టి యిల్లు నేకొంటేను
ముండువాలేదాని మండిపడ్డాడె ॥నె॥
ముప్ఫయిరూపాయలెట్టి పట్టిమంచం నేకొంటె
పందిరిలేవాని పక్కానవ్వేడే ॥నె॥

## పాట.

వివాహభోజనంబు వింతైనపాయసంబు
ఘనమైన ఉప్పళంబు కడుమంచి అప్పళంబు ॥వి॥

సభ్యులూరజేయుచు విందు సంతోషముగతిందు
సాకేలచేయచుముందు లేకున్న మనసుగుందు ॥౯॥
బకేశబాసులడ్డు పురుగెత్తుకేమి అడ్డు
జిలేబులారలెండు శీఘ్రింబెయిటుస రండు ॥౧౦॥

## కమ్మలజోడుపాట.

యిక నేను రానుపోరా తెల్లరాళ్ళ కమ్మలుతేరా
వేషభాషలేగాని పోషింపచేతరాదు
రోషమయినా లేదేమిరా తెల్లరాళ్ళ॥
శేలమంచుపంచిగట్టి సిల్కుచొక్కాను వేసి
చేతనయితె యిచ్చిపోరా తెల్లరాళ్ళ కమ్మలజోడు
ఎఫ్ యేపాస్యయినవాడా యికనిన్ను నమ్మనుపోరా ॥తె॥
యిల్లయినా తనఖాపెట్టి తెల్లరాళ్ళకమ్మలు తేరా॥
రాజమండ్రిపురములోన రంగయిన చిన్నవాడ
రంగయినముట్టనివరా తెల్లరాళ్ళ కమ్మలుతేరా ॥యిక॥

## పాట.

వందే వందే భారతమాతా వర్ణవిభేదము కల్పితమైనా అందరుమానవు లొకటైయైనా మాకీకర్మము తప్పదుయేలా ముస్లిము హిందూ హరిజనమాత సమస్తజగతీ గీతామాతా ॥వందే॥ సహోదరా సహోదరా దీక్షనుగైకోరా మాలలమేనుకు ప్రాణములేదా, హరిజనసేవా హరిసేవారా అవశ్యకరణీయం బీవేరా ॥వం॥ దాస్యవిమోచన మార్గములేదా............ వందే॥

## పాట.

హే రాధారమణశ్రీశా ॥హే॥ ఆఆఆ భామామణి హృదయలోలా ॥హే॥ కరుణాసింధూ కాంచనచేలా గరుడారుడాయ కమలానాభా ॥హే॥ శరణాగతరక్షణబిరుదాంకా ఆర్తావనా ఆఆఆ పరమసుజ్ఞానా మురళీమోహన అనయముననూ । మరువను మీపాద సరసీరుహములు ॥హే॥

# గ్రామఫోను పాటలు.

## కామిక్.

ఆహా! మినపపడ, మంచి మినపవడ
ఆహా! నేయియందు నేటితోను కూడు ॥ఆ॥
నీవు పోయి నాపొట్టలోనె జడగట్టి
పేగురా పెద్దపెద్దలాడ ॥ఆ॥
కోరికోరి దుడ్డుపెట్టి కొంటివే వడ
నోరుతెరిచి నిన్నువేస్తె జారిపోతివే వడ ॥ఆ॥
తూముపప్పు నేయియిచ్చి స్వాములకటయే
మాఅకతింటినే మసాలవడ ॥ఆ॥

## ఈతపళ్లుపాట.

పం — ఈతపళ్ళోయిబాబు ఈతపళ్ళండి
పచ్చపచ్చనిపండ్లు మామంచిపండ్లుబాబు
యిరుసుమట్టలనుండు యిరివిగలపండ్లుబాబు
మచ్చలేనిపండ్లు మచ్చుచూడండి ॥ఈ॥
య — పళ్ళుపళ్ళని కలుమారుమన్నారు
పండ్లట్టుకొనిరాయె ఓపసుచుపావ॥
పం — బాగా వలిగినపండ్లు పుచ్చుకోకండిబాబు
గుల్లింబిదీయండి గుమ్మైనపండ్లుబాబ ॥
య — పళ్ళుమ్మి పళ్ళమ్మి పట్టుకొనివచ్చావా?
పచ్చపచ్చనిపండ్లు పరువైనపండ్లేనా?
పం — పచ్చపచ్చనిపండ్లు పరువైన పండ్లుబాబు
మచ్చలేనిపండ్లు మచ్చుచూడండి॥
య — వీధిలో నిలబడి యింతమాట్లాడావు
సావిట్లో దింపితే చాలాబాగుంటుంది॥
పం — తలుపెయ్యమంటావు దడదడవస్తావు
పళ్ళగుత్తి సిలాగి అట్టిట్టుచూస్తావు ॥ఈ॥

అసావేరి — ఆది.

ఓసిపింజారిముండా నువ్వునాకొద్దుపోవే
వద్దువద్దంటె సిగ్గుండ వద్దంటె నీకోసెరండ ॥ఓసి॥
మద్దేనకాడపోయేవు అర్ధరేతిరికాడవగొచ్చేవు
నీవాటము నాకొప్పదోలె నీజోలింక నాకొద్దోలె ॥ఓసి॥
అళ్ళుసెప్పనీ యీళ్ళుసెప్పనీ వోళ్ళుసెప్పిననాకొద్దోలె
నీముట్టమున్నకాడకేగవే నిన్ను ముట్టుకుంటేవట్టుసూడవే ॥ఓసి॥
సక్కనిసుక్కవని తెచ్చానుగాని సంగ తెరుకుంటేను
దెత్తుసంటె పలుగుముండ నీదారిమానుకోయే
బతిమిలాడినా నాకింకొద్దులే ॥ఓసి॥

## ఓటు పాట.

నాకేయండి మీఓటు నాకేయండి ॥నా॥
మీఓటునాకేస్తె పనులు సేనిస్తా,
మీకు చాలాలాభకరము చేస్తా ॥నా॥

## పంబ పాట.

వచనం:—పార్వతిబుట్టింది పంబబుట్టింది ప్రంబబుట్టకముందు రుంజ పుట్టింది రుంజకోసం దేవతలు గిజగిజగింజుకున్నారు. ఆపంబవాయించె అంబరీషుండు ఆపంబవాయించె పరశిరాముండు ఆపంబవాయించె పద్దనాబుండు పద్దనాబుండు బాగావాయించేడన్నా! పార్వతిపంబ పరమేశుండు వాయిత్తుంటే! కింద ఎవరుసూత్తున్నారండి! అయోధ్యపురవాసులు దశరదమహారాజుగారు మునులు జనులు సావుకారులు సంపన్నులు డాక్టర్లు వంటబ్రాహ్మనులు అప్పుడు వూబగుండోరి బొంగు తీసుకొచ్చి పంబలోపెట్టి వాయించారు.

## పాట.

పార్వతీయాపంబ। పరమేశుండోయిస్తె। పర్వతాలేడెక్కి బద్దలై

నాయి । పర్వతాలేడెక్కి । బద్దలౌతుంటేను । వంటబాహ్మణులంత వారి గిపోనారు । వంటబాహ్మణులంత । వారిగిపోతుంటేను । డాకటేరురూ మంతా । దద్దరెల్లింది । డాకటేరురూమంత । దద్దరిల్లుతుంటేను । దేవతలు మంచాలు । గెంతులేశాయి । దేవతలు మంచాలు । గెంతులేత్తుంటేను । ఆ యావ్రదూడాలు । అడిలిపోనాయి । ఆవూవుదూడాలు । అడిలిపోతుంటే ను । సిగలుపట్టుకోని సిందులాడేరు । సిగలుపట్టుకోని సిందులాడుతుంటేను ఎంగిలు చేతులతో ఎల్లిపోనారు.

వచనం:—అది యినపపంబకాదు, రాగిపంబకాదు యిత్తడిపంబ కాదు. సేవెండిపంబకాదు. ఎండిపంబకాదు. అది తోలుపంబకాబట్టి యింత మంది దేవతలు ఏమి సేశారంటే

పాట:—తోలుపాము పట్టుకోని తోమేసినారు.

### రాక్షసుల పాట

సూసార మన పెబువు సుందరం ॥ఓహో॥
ఓసోసి ఆమొగముతీరు మనమెంతానివరిణింప
ఏమానివరిణింప ఏమానివరిణింపగలమా ॥సూ॥
భీమరాజు కురిడంటె బింకమైనవోడు
సోమశేకరునికన్న సొంపైనవోడు
యిడింబికొడుకంటె ఈనాటివోడు ॥సూ॥

### పాట.

దండా దండాలు మాసామె మాదొడ్డసామె
సల్లంగయేలేటి దాతవయ్యో మాదాతవయ్యో
కాపాడిరక్షించు కన్నతండ్రో మముకన్నతండ్రో
యెయ్యేలువర్ధిల్లి యేలు పెబువా మమ్మేలు పెబువా ॥దం॥

### పాట

కొడుకా గణేశరావా నువ్వు పాడయిపోతావురా ॥కొడుకా॥
పట్టుపంచెలు కట్టబోకురా పట్టణమంతా తిరగబోకురా ॥కొ॥

గంగువంచెలు కట్టబోకురా రాజమండ్రి వెళ్ళబోకురా ॥కొ॥
సన్నవంచెలు కట్టబోకురా సానియిండ్లకు వెళ్ళబోకురా ॥కొ॥
సిల్కుచొక్కాయి వేయబోకురా చీపురుదెబ్బలు తినబోకురా॥
కావివంచెలు కట్టబోకురా కాళ్ళతాపులు తినబోకురా ॥కొ॥
ఖద్దరువంచెలుకట్టబోకురా కాంగ్రెసులోను తిరగబోకురా ॥కొ॥

మాండు—త్రిపుట.

మాయిదారిపెళ్ళాలు మామిడిసిపడుతున్నారు
మొగుడిగాడిమాటంటే ముండానాసైతు లినరుగా ॥మా॥
పెద్దపెద్ద పేచనులంటారు పేమపొడును ముఖానపూచుకుంటారు ॥మా॥
వద్దువద్దంటె మండిపడతారు మాగంటె నిన్నిడిసి
పోతామంటారు ॥మా॥
నాటకాలు సినీమాలంటారు డాన్సింగు పార్సింగులంటాను
సందకాడనగపోతారు తెల్లారగట్లనక్కావత్తారుగా ॥మా॥
సంతల్లోకీ రైకలు సక్కావచ్చాయి వాసినకట్టు మొలకువచ్చింది
పూరోత్తరాల సరుకులుపోయాయి బేసల్గిర్వానాలు
పేసనైనాయి ॥మా॥
కలవరేకుల్ని గెలిచేటి కల్లాను వాటమైన ముక్కుదూలొచ్చాయి
కాళ్ళకు సిప్పర్లుతొడుగుతారు అదేంటి అంటేను
ధుమాధుమాలాడుతారు ॥మా॥

యర్రియ్యబావపాట

యర్రియ్యబావా । యర్రియ్యబావా
నామొరాలకించరో యర్రియ్యబావా
చక్కనీ నీకనులు చక్కానీ కనులు
వలువరుసాముత్యములు । వలువరునముత్యములు,
వలపూ నీవయినిగలిగి నిలువాకున్నాదిమనసు ॥య॥

నీయందమునుజూడ నీయందమునుజూడ
నీపైని నామనసు నిలిసింది కలిసింది ॥య॥
ముక్కురోరము నాడు చక్కానీ రోజున
బురాగినున్న గదువ్వి కిరుగి చెవ్వాలుతోడిగి
రెక్కడికో రెయిలుతుంటె యేగాదిగాచూశాను ॥య॥
సంపంగితైలము సొంపుతో నేరాయ
సక్కగున్నాదాని కనుసైగా చేసినావు య॥

## పాట.

సోకుగాడే సింగినాయనా
కాకిచొక్కావేసుకొని కాకినాడ వెల్తుంటె
కాకిపిల్లతన్నింది సోకుగాడినీ ॥సోకుగాడే॥
ఏలుమఃడివేసుకొని ఏలూరువెల్తుంటే
ఎలకపిల్ల తన్నింది సోకుగాడినీ ॥సోకుగాడే॥
సైకిలువేసుకొని కైకలూరు వెల్తుంటె
కోజుపిల్ల తన్నింది సోకుగాడినీ ॥సోకుగాడే॥
ఒంటెద్దుబండిఎక్కి ఆకివీడు వెల్తుంటే
బాతుపిల్ల తన్నింది సోకుగాడినీ ॥సోకుగాడే॥
కట్టుపంచెకట్టుకొని పాలకొల్లువెలుతుంటె
పాముపిల్లతన్నింది సోకుగాడినీ ॥సో॥
చుక్కబొట్టుపెట్టుకొని నూరికింద నిలుచుంటె
నుంచుపిల్ల తన్నింది సోకుగాడినీ ॥సోకుగాడే॥
సన్నపంచెకట్టుకొని సామర్లకోట వెడుతుంటె
పానిపిల్ల తన్నింది సోకుగాడినీ ॥సో॥

## చాకలివానిపాట.

చాకలి—ఎల్లెల్లెనంజా నీవోటము నాకెరిక నేదా బెంజాలినంజ
నూరిగాడు నీకాసి నూచిననూపులకు

నీవొల్లుపులకరింపులతో ఎత్తించెకైపు॥

యారి—ఆపాటి సూపులకే వోపకపోతే
నీచేపాటికర్రికి తానోపగలదటారి॥

చాకలి—మాపిటికి నాకాడ మరిపాసగదోలె
మారుమనుము నూనుకోయె
నీమాటంటె మరిపాసగదోలె
తలున్నుకుంటె సాలు తరుగుకుపోతున్నాది
మనను తెగునుకుపోతున్నాది
మారూమనుము నూనుకోయే నువ్వ ॥మా॥

లచ్చి—యీపాటినూపులకే నోపలేకపోతే
నువ్వేపాటి మొగుడివిరో రెంకయ్యాబాబూ
నీతాపులెట్లు తింటదిరో రెంకయ్యాబాబూ॥

చాకలి—నీబడుచుతనపు వడుపులకీ గడుసుదనపు రాకటికీ
మిడిమేలపు మాటలకీ మించిపోయె నామనను ॥మా॥

యారి—తప్పొచమించమంటె వప్పొకుంటున్నావు
నిన్నిడిచి తానుండగలదా బావ దాన్నిడిచి నువ్వుండగలవా
దాన్నిడిచి నువ్వూ నిన్నిడిచి తానూ
ఎప్పుడైన వున్నారా మాపిటికి నీమనను
మారిపోతుందేమో మాటుమణిగిందంటే
మారిపోతాదిమనను మారిపోతాదిమనను దాన్నిడిచి॥

చాకలి—నువ్వొద్దె నాకింక తుంటరిగుంట
నిన్నొదిలేస్తె పోతాద నాకీతంటా॥
నీయమ్మలాటిదొస్తాద యింకొకగుంట
నువ్వు నూరిగాడికేయెల్లే సుప్పనాతిగుంట దొమ్మరినంజా॥

## పొరుపల్లి సత్యనారాయణగారు, బెజవాడ.

పద్యం.

సీ. ప్రాణేశ నీమంజు భాషలువినలేని । కర్ణయుగ్మంబుల కలిమియేల
పురుషరత్నము నీవు భోగింపగాలేని । తనులతవలని సౌందర్యమేల । భువన
మోహన నిన్ను బొడగానగాలేని । చక్షురింద్రియముల సత్యమేల । దయిత
నీయధరామృతంబానగాలేని । జిహ్వాపు ఫలరస సిద్ధియేల
గీ. నీరజాతనయన నీవనమాలికా । గంధమబ్బలేని ఘ్రాణమేల। ధన్య
చరిత నీకు దాస్యంబుచేయని । జన్మమేల యెన్నిజన్మములకు.

### పాట.

సాహసమేల యీలీల జానకీ వెతబడకే పతిసేవనభాగ్యమే ॥సా॥ వి
నుతాచరితామాతా బేలాతనంబేలా సుగుణోపేతా సుచరితమాతా ॥సా॥

### పిల్ల, బావపాట.

నాయుడోరింటికాడ నల్లతుమ్మచెట్టుకాడ నాయుడేమన్నాడే పిల్లా
నాగుండెజల్లుమన్నాదే రైటో ॥నా॥

రెండిల్లసందునా రోలేసి కూసుంటె దెయ్యమనుకుంటినే పిల్లా అబ్బ
గుండెజల్లుమన్నాదే రైటో ॥నా॥

నానుంది పట్టెడుంది నాలుక్కోళ్ళ మంచముంది మంచమెక్కి దం
చరో మామ అబ్బనాగుండెజల్లుమన్నాది రైటో ॥నా॥

మిద్దింట్లో మంచమేసి మేకతంపటి కుంపటెట్టి మేనమామను తోడి
య్యేలమ్మో అబ్బ నాగుండెజల్లుమన్నాది రైటో ॥నా॥

ఆకేనుకో పోకేనుకో లవంగాలు మొగ్గేనుకో మొగ్గమీద డోసేను
కో లమ్మో అబ్బ నాగుండెజల్లుమన్నాదేరైటో ॥నా॥

### కామిక్.

వస్తున్నాదిగా వస్తున్నాదిగా వయ్యారిభామా సక్కానిసోకు డేరా
లెయ్యండి మాకర్రితుమ్మచెట్టు మాయందమైనదట్టి మాచాకిరేవుబల్ల గుడ్డి
కన్నుకి గుల్లడికాకి గుడ్డిల్లాలికో గుడ్డిల్లాలికి నడ్డికాలికి నాగలికోక గుడ్డిల్లా
లికి అఆఇఆ గుడ్డిల్లాలికి ॥వ॥

హిందూస్తానిపాట.

సునోసునో బనకేప్యారీసీ, బనిహుం ఆజతుహ్మారీరాణీ
తుమ్‌ఫేకఖడే క్యా కరితీ!
క్యుంనహి రాహ పెహరాబేదీ । ఘుస్సాచోరకరానాహాసీ।
ఏఖార్! కరోమత జల్దీ బనో
సిపాహిబే దర్దీ । సబనే రోజకరో సైతానే॥
తుమకుంజ బడీ మస్తానీ । బనజానా రానీకినానీ।
సదా శరీర బఢే లాసానీ పత్తర్ తుమ
మంత్రి బననా రాజకాజమొ బాధా దేనా
ఆపకీ యా కలనా నాదానీ ॥సు॥

ముఖారి—ఆట.

స్వాతంత్ర్యమెలేదా స్త్రీజాతికి
పతులకు సతులూ పరిచారమునకా ॥స్వా॥
భారత దేశాంగనలకు భాషాపటిమంబుగలదు
పూర్వాచారములన్నియు పాలతుల పీడింపగన్
అప్రియంతగా వినినుంతన్ లేవాయిక
సంఘసంస్కర్తలు మాకిక నీగతి ॥స్వా॥

కల్యాణి—ఆది.

మాతా నడువాలేనాహా యీకాననమున నేను గనగా ॥మా॥
పదములెంతో పొక్కెనో నాపదములెంతో పొక్కెనో
అడుగైన నిడగలేనే నాఖర్మమిటులుండేన్ గనగా ॥మా॥

నందిని, సుధీర్ పాట—డైలాగ్.

నం:—ఆ జహామె వనబే హద భాతా । దేఖీ సభీ వస్తు అతి
సుందర క్యా వసంతహై ఆతా । కలకల కరతీ
వ్యాకులహోనదీ కిధరచలీ ఇతలాతీ!
సు:—అపనే ప్యారే మిత్ర నీర సాగరనే మిలనే జాతీ
నం:—వహా మాలతి రేల ఫేడసే మిలకర క్యా కరతీహై

## (18) గ్రామఫోను పాటలు.

సు—చాహతి హై ప్రీతమసే ఉసకో విసట హియా భరతీ హై
నం—గునగునకరతా యహ భహరా యో
కిసకీ గున హై గాతా!
సు—గాతా హై గున గులగులాబక జిససే రస హై పాతా
నం—కుదరత మేయే, హైన మేలకా కహాంకి చెలియేహోతా,
సు—అనుభవకరతా హై జిలమే వనరా పరశ్యో నహీ బతలాతా
నం—ఆ జహామే వనబే హద బాతా॥

### పాట.

సఖియా ఇక నే తాళలేనే ॥స॥ సఖియరో నాప్రియ
సఖునిటు తేవే ॥స॥ ఎన్నెన్నో బాసలు నేర్చినాడె
ఎంతో ఎకసక్కెము లాడినాడె ॥స॥

### పాట.

వనువీడగగలవే బాలా, చనదే బాలా నీవిటుల ॥వ॥
నినువదలగనే నేరసుహృదయా గనుగొనుమీనిజ మనురాగలయా
మనసానందము నొందెను చెలియా మానుదు నేసఖియా ॥వ॥

### పాట.

చెడుపలుకులాడెగా జడమతి ధనమదాంధుడై
పితరులను ॥చెడు॥
పడు మనిత్తునని విడచిన విడనీ వెడగుమాటలని
వివేకరహితుడు ॥చె॥
కులకులాధముల దరిసిరి యదుజులు అరిజనాప్తులికె
హాలాయుధుణ్, లేపెదమడింతుజననీ
వైరియైన శౌర్యైన విడువను ॥చె॥

### పాట.

అబమై పె జానా హై। హోయ్ ప్రేమక్యా హై
హమ్మగరు జానతేకీ ఇక్కదరూఁ డేతా హై

# గ్రామఫోను పాటలు.

తో॥ భలా కిసలియే ఇస్ మర్జకా సోడాకరతే॥
ఫేరి బనా అబదిల్ లకీ జేడీ జోజే బవరుమానాహై
ఇస్కా దిల్ హిల్ ములకె జోస్తిమే ఏకహుయే?
జిలనేగమా ఇశ్క నికాలెతో దిల్ భి జాతాహై ॥అ॥

## పాట.

1 కరిరాజదేవదయాలో - ననుదరిజేర్చుము కృపాలూ
నీవేదిక్కుగోపాల - నామొరవిను మిక భూపాలూ ॥క॥
2 భక్తవత్సలాదేవా - నాపైకక్షయేల యటురావా
భిక్షమడిగితిదేవా - మోక్షభిక్షమొసగి ననుబ్రోవా ॥క॥
3 పాండవకులపరిపాలా - మార్తాండభక్తజనపాలా
దనుజహారి నిను చాలా - కోరివేడుచుంటినీవేలా ॥క॥
4 బాలుడనంటిని స్వామీ - నాదుకల్మషము బాపవదేమి
పలుకవేల నాస్వామి - యికచలమేల నుసామి ॥క॥
5 నిను నమ్మియుంటినోయన్న - నన్ను మన్నగ చేయగదన్న
జగమంత యికనున్న - నాగతి నీవేప్రాపన్నా ॥క॥
6 వాసిగ వైశాఖపెర - నివాసుడైయుంటిరా
ఈశా నీనామమేగదరా - నాకుదినియుంచితిగదరా ॥క॥

## పాట.

1 జై జగభో శ్రీహరనాథా జై జగపావనశీలా జై జై ప్రభో నీచరితములిన్న
జన్మదుఃఖములు జెందవటన్న జాగమేలకృపజూడగదన్నా ॥జై॥
2 ప్రేమమూర్తి నీప్రతిమే గృహమున భక్తిమీరగన్ బాడుకొల్చినన్
పావనమై యిలరారుగదన్నా ॥జై॥
3 శ్రీహరనీపదసేవకుడైన శంకరలాల్ నీస్మరణసేయగన్ దుఃశనమే
దాటించితివట ॥జై॥
4 ఖగభయదాఖగవాహనచర నిగమగోచర నినునే నమ్మితిలా పగ
తునిగా బాలింపకబ్రోవరా ॥జై॥

## ఎ. వీరభద్రరావుగారు, విజయనగరము.

### పిల్ల, నాయుడు పాట

1. ఓహో నాయుడ వయ్యారినాయుడ పగడమారినాయుడ జమ్మిపురి జమ్మిప్పల నాయుడా ॥జ॥

గబగబ సైరుకొట్టుక్కోని గుండుజోడు పెట్టుకోని క్రిరుజోడుతొడుగుకోని కర్రికిరుచ్చనడకలతో కర్రిచేతపట్టుకోని కామమ్మసందుకాడ కనబడినప్పుడు నాతో గొప్పమగమ్మని నాతో సెప్పనేదనాయుడా అగనాలిత్తానని ఆసపెట్టనేదా కూలికి ॥ఓ॥

నాయుడు—ఓహో కోడలా వయ్యారికోడలా వంగపండోళ్ళ నడిపికోడలా గాంధికోకకట్టుకో గడ్డిజెంబు పట్టుకోని అడ్డపోగెట్టుకోని వన్నెవన్నె నడకలతో సిన్నెసిన్నె పలుకులతో కామమ్మసందుకాడ కనబడినప్పుడు నీతో గొప్పమగమ్మని నాను సెప్పినానె కోడలా నీటిపదును లేక నాటినాయికావు బోరిగెలు అందుచేత పిలవనేదె కోడలా ॥ఓ॥

2 ఓహో నాయుడ వయ్యారినాయుడ దగాకోరునాయుడ ॥జ॥

నీటిపదును లేక నాట సేదన్నావు బోరిగెలు యెగువ్రమడిలోన మొన్న యెంకప్పనెట్టనేద దిగువమడిలోన నిన్న దుర్గప్పనెట్టనేద మద్దిమడ్డిలోన యీయాల మంగప్పనెట్టనేద మంగప్పతో నీవు గట్టుమీదకూకోని ఆడుకున్న రీతిగ ఆడుకోనేమా మరి ఆశికాలాడుకోనేదా మరి అందుకొని నువ్వు అందియ్యనేదామరి అంటివం డందియ్యనేదామరి సాటునుండీ నేను సూడనేద మరినాయుడ యీయాట నీయింటిదానితో ముట్టగించనామరి నాయుడ ముట్టగించనామరి నాయుడా ॥ఓ॥

నాయుడ—ఓలేలె కోడలా వయ్యారికోడలా వంగపండోళ్ళ నడిపికోడలా సెప్పకేనీకు దండమెడతానె కోడలా అది రాకాసిముండోలె కోడలా మరియింటిలో నుండనివ్వరె కోడలా నన్నిక యెంటాతరుమూతాదె కోడలా మరిమూకమీద యెప్పుడైన కోడలా మరి నిన్నేరమ్మంతానె కోడలా

కూలికి వోలో శికోడలా వయ్యారికోడలా సెప్పకే నీస దంచ మెడతానె కోడలా ॥ఓల్లె॥

## జాగరతెవోలెంకి పాట.

జాగరతెవోలెంకి జాతరెల్లొత్తావు ॥జా॥
జాగరతసేసుకో నానుకోళ్ళు రెండూ ॥జా॥
బాపనోరుంటారు కోమిటోలుంటారు
కాసవోలుంటారు శూద్రిపోలుంటారు
నానాజాతులవోళ్ళు నలిపేస్తారోలె నలిగిపోతావోలె ॥జా॥
యెనకముందు అనకుండ ముందుయెనకలనకుండ
(ముండరగిడీసోల్లు) సందుదొరికిందంటె
మెడలో చెయ్యేడతారు యానురుగుంటేను
యెత్తియెల్లిపోతారె ॥జా॥
అల్లాదొమ్మిలో ఆమూకలో లజ్జుగుజ్జులుపడకుండా
రాటుపోటుతినకుండా రెండూ దక్కించుకోని
రేపే దిరిగి రాయాలె ॥జా॥

## గాజులపాట.

1. అబ్బానొక్కకోయి । గిల్లిగుచ్చకోయి నలిపి తొడగకోయి! తోసిపెట్టకోయి । నేతాశజాలబిగువు గాజులు॥

2. అగులామారీచుడవు బేరమాడ పచ్చేవు గోరుమీటించకోయి పెద్ద బూరుగవలె వాసిందిచేయి అబ్బానొక్కకోయి॥

3. అందముగా నాతో బేరమాడను రారమ్మంటె పొందుగాగొంగ శృగుడ్డ కిందపర ి కూర్చుంచపెట్టి నొక్కకోయి అబ్బానొక్కకోయి॥

4. తప్పక మాకోరుకోండా దాముని తో యెప్పుడైన చెప్పుకుంటే వట్టూబెట్టయ్యా గుప్పాటే చాటూనబెట్టి నొక్కకోయి గిల్లిగుచ్చుకోయి॥

పాట.

దేవునిమహిమా దెలియగవశమా పాపులకీ యిలలో కన్నులుదెరచీ
గరువము విడచీ కాంచనచేలుఁ గనరా జీవా ॥దే॥
పాపపహిన్నెలో పడబోకురా తరుణీలోలుండవై ధనముకై లోకము
దోయకురా కుమతివై నీతినిబాయకురా దేవుని కనులఁ మాయగ
లేవు యమబాధలు తప్పవురా మూఢా ॥దే॥

పాట.

సుభద్రా విధిన్ దాటకతీరునా ॥సు॥
కానున్న దేదైన కాకుండునా ॥సు॥
ఏచోటప్రాప్తంబో ఆచోటనే
వివాహంబు ప్రాప్తింపకేమీరునా,
వృధాభ్రాంతి నీకేలనో సోదరీ ॥సు॥

పద్యం—బిలహరి.

గీ. ఔర చేజిక్కినటుజిక్కి పారిపోయె
సకియ లేతెంచి గనునొక సాకుజెప్పి
చేతబడినట్టి పరిమళ జాతిసుమము
వాయువశమున మాయమాపగిది చెలువా.

పాట.

సారాయి పొట్టనిండ తాగుదాం, గొర్రెన్ని మేకల్ని
కొత్తకన్నెనూ అమ్మోరికిచ్చేసి, గెంతుకుంటు
గొంతుదాక ॥సా॥ ఓర్యారిమాటసెల్లి,
దేవికోరికాతీరి భళిరమనము కోరుకొనిన
వరములన్ని దొరుకుతాయి ॥సా॥

# గ్రామఫోను పాటలు.

## వెంకటస్వామిపాట.

ఓహోలీ వెంకటసామి, నిన్ను నేను మరువజాలరా

॥ఓహో॥ కోమటోడి కొట్టుకెళ్ళి కొత్తచీరతెచ్చి

మడతమడతకీ నీమీదెవ్వుండు నామసు ॥ఓహో॥

## పాట.

పూలో—పూలో—పూలో కనీకోనుడూ -పూలూ

మల్లెమాలతీజాజీ గులాబిలు విరజాజీ

కనకాంబరి సంపంగి నీలాంబరి గేదంగి

కోరినరంగులపూలూ - పూలూ - తెనుగుతోటలో పూచినపూలూ

తెనుగుతల్లీకట్టినవీ - నా - తెనుగుతల్లీ కట్టినవీ - పూలూ -

దేవార్చనకూ శ్రీమార్చనకూ

తల్లీపూజా కివిగో పూలు - పూలో -పూలు

## పాట.

తూరుపు తెలతెలవారెె—పోయెను చలీబడాయీ ॥

చల్లనుచిలుకూ మా వదినా ॥ తూ॥

వడివడినీ— మేలుకోనీ—చలిది తినీ—

తయారానై చూడూ—జీత గాడూ—యెడ్లజోడూ ॥ తూ॥

మేలుకొలుపుతోడా—అడుగడో రాగలోలా

మా వుషారాణి—జోతినీబూని—బిరబిరా చేరరాగా ॥ తూ॥

## పాట.

1 శ్రీహరనాధసేవ - యిహపరములకు తగుతోవా

మహిలోనీవేగావా - నీమర్మము దెలుపగరావా ॥శ్రీ॥

2 పావనమూర్తిగోపాలా - పక్షపాతముజూపెదవేలా

పాగల్ హరనీలీలా - యెడబాకదలదును వేలా ॥శ్రీ॥

3 కామేశ్వరపరిపాలా - ననుకరుణింపగజేలా
శ్యామసుందరజాగేలా - నీనామము నమ్మితిచాలా ॥శ్రీ॥
4 శ్రీమూర్తి ననుకొంటి - పాపంబులు బాపగమంటి
పాపిపెవ్వరు లేరంటి - ననుకాపాడగరమ్మంటి ॥శ్రీ॥
5 సోనాముఖిపురవాస - శ్రీశాంభవిద్విలాస సుప్రకాశా
శేషశయనమణిభూష ః శంఖచక్రధరాజగదీశా ॥శ్రీ॥

## పాట.

ఓ మురళీ ! ఓ మురళీ ! మురారి నీపరితేడా మురళీ
పువుపాదమాటున యేటికిలోపలకేగి పిల్చితి పక్కడే—మురళీ
నాపై అలుకో ఆదేలో తెలుపగదే—

## పాట.

చేలతనమూ పడినా ఫలమా విధిలిఖితం కడచేనా
నేటి ప్రభువూ మరుదిన మెవరో తెలియుపశపూనా— ॥చేల॥
కలిమీ లేమీ చావును బ్రతుకూ
కావడి కుండలురా కర్మము మునిగి
ఫలమును విడిచి సుఖము కనెదవురా— ॥చేల॥
దేవుండనుకో విధియని పిలువూ
లోకమాతనిలీలా—ఈ—లోకమాతనిలీలా
పేద నవాబూ—రాజుకరీమా లోకనాటక మిదిరా ॥చేల॥

## పాట.

పిన్నమ్మోతె పిన్నమ్మోతె పిన్నమ్మోతే పిన్నమ్మా ॥పి॥
బలేసోకుదారి కుర్రోడే బలేటేకుదారి కుర్రోడే ॥పి॥
మాయమ్మతోడబుట్టిన అందమైన పిన్నమ్మా ఆఆఆఆ పిన్నమ్మా ॥పి॥
సందులోకనబడి సంకలో చెయ్యేట్టినాడు
నాతో నీవురావే బయస్కోపుకు వెళదామన్నాడే ॥పి॥
బయస్కోపుకు వెళ్ళినాము దీపాలు ఆర్పినారు తెరతీసి చూపినారు
॥పిన్నమా॥

వచనం:—పిన్నమ్మా నీదగ్గర చెప్పడానికి సిగ్గుగాయుండిగాని ఏమని చెప్పను.

పాట:—అందులోని అరబొమ్మలు గుడ్డెత్తిఆడినాయి అంతలోకి వక డొచ్చి ముద్దెట్టుకున్నాడు అప్పడు వళ్ళుజలదరించింది కళ్ళుమూను కుపోనాయి తరువాత ఏమిజరిగిందో చెప్పలేను పిన్నమ్మా ॥పి॥

## బెల్లకొండ సుబ్బారావుగారు.

కాఫీ.

ఉ. చెల్లియొ చెల్లకో తమకుఁ జేసిన యెగ్గులు సైచిరందఱుం
దొల్లిగతించె, నేడు నను దూతగఁ బంపిరి సంధిసేయ నీ
పిల్లలు పాపలుం ప్రజలు పెంపుమహింపఁగ బొందు సేసెదో
యెల్లిరణంబు గూర్చెదవొ? యేర్పడజెప్పుము కౌరవేశ్వరా!

కాఫీ.

చ. అలుగుటయే యెఱుంగని మహామహిమాన్వితు డజాతశత్రుఁడే
యలిగిననాడు సాగరము లన్నియు నేకముగాకపోవు, క
ర్ణులు పదివేవురైన నని నొత్తురు చత్తురు రాజరాజ! నా
పలుకులు విశ్వసింపుము విపన్నుల లోకులఁ గావుమెల్లరన్.

పాట.

స్వేచ్ఛాపథమూ చూపుము మాకో
మాతా భారతభూమాతా ॥స్వేచ్ఛా॥
కులమతకలహము కూలగదోసీ
సం.కెళ్ళూ తెగగోసీ—మాతా భారతభూమాతా॥
భయములులేనీ—పరువూవిడనీ
బలసంయుతమగు పౌరుషమీమా

పద్యం.

సీ. కనులెర్ర జేసి యాగర్జనలేల నీ
బెదరింపులికకట్టిపెట్టుమమ్మ
మగని కూరిమి నెంచి తగిమాయమాటల
పురివెట్ట నాప్రణ మెరుగవమ్మ
నీకపటోక్తుల నే రాజు నమ్మినా
యుచితజ్ఞులగు మంత్రులుండరమ్మ
మంత్రులెల్లరు నీతిమంతులు గాకున్న
నిజ లోకులెరుంగ నేరరమ్మ

గీ. పుడమిపై ధర్మమడుగంటిపోయి, నీకు
కృత్రిమమె దుర్జయంబయి కృపదొలంగి
విభుడు నామీద ఉరిశిక్ష వేయనున్న
నేమిసేయుదు నాపయి యీశ్వరాజ్ఞ

పంతులమ్మ పాట.

పంతులమ్మ మా పంతులమ్మ బలే పంతులమ్మ సెబాస్ పంతులమ్మ॥ సంతసముతో పంతులమ్మ సైకునుంటె సల్ల గుంటాది॥ నాకంతతో సల్ల గుంటాది॥

పాట.

మోమోటమా విశ్వమోహనాకార ॥మో॥
మాటాడవేర మానసచోర మార ॥మో॥
మదనాగ్నికోర్వనుర కరుణింపవేర
శ్యామసుందరకార శ్రీమదీర్చవేర ॥మో॥

పాట.

అనరా హరి హరి శ్రీ హరే అనరా హరి హరి శ్రీ ॥అ॥
అనాదపాలా మాధవా ॥అ॥

సతత సతితా నందవైభవా శాంతిః శ్రీహే కరుణాప్రా
శంఖచక్రగద శాంగధరశ్రీమలా
శ్యామసుందరా హే ప్రభో ।అనరా॥
కాలకింకరులు పిలువకమునుపే కంఠపాశములు
ఓగియకమునుపే ఘననిద్రాంకము మూయకమునుపే
తనువుబాసి తొలగకమునుపే ।అనరా॥

పాట.

పరేశా మురారి దయాసాగర ॥ప॥
మునినాథగేయ నతశ్రీశ ॥పరేశా॥
సుధాబ్ధిశయన సదానుగ్రహా, మను రాపలోకన
సతాంగ్రహా మణిహార హారి ప్రభావాకర ॥ప॥

మియాకీమల్లార్ — త్రితాల్

ఏలా మదిలో భీతిజెందన్ బాలులీల తేతరినిన్ గనుమన్
చాలున్ మదివగబూనన్ ॥ఏలా॥
సుఖమొదవంగన్ ముదమేపారన్ మేరలేని ధృతిమీరన్
దుఃఖమొదవ్రచో సుఖంబెడయున్
పగచుచునుండగ వేలా ।ఏలా॥

పహాడీ — త్రితాల్.

తగ దిది మ మా దండధరుడవే
ధర్మవిధికి మర్యాదా మామా ధర్మవిధికిమర్యాదా
మహిలో భారతమహిళాశీలము
మాపోనరించెదనా ।మామా॥
మారాజ్యమునకే మాకులమునకే మహా
ఒపయు ఖిద కాదా ।మామా॥

## హరనాథబాబా కీర్తన.

విశ్వమాత వేదభూత కుసుమహరనాథా
సతీశుశ్రీతి ఘోరభవబాధా నిఖిలనూనిన
వారలదయతో నీదరిజేర్చవా, నీదుదివ్య
దర్శనమొదవెను నాదుజన్మము తరియించెన్ ॥వి॥
దేవి శ్రీకుసుమకుమారీ దివ్యగుణహారీ, సురారీ,
పావనా నీభక్తకోటికి పాలనశేయంగా, దయచేసితే
విష్ణుమాతా వేదభూత కుసుమ హరనాథా సతీశుశ్రీ ॥వి॥

## చల్ మోహనరంగపాట.

చల్ మోహనరంగా నీకు నాకూ జోడుగలసెను గదరా ॥చల్॥
నీకూ నీవారులేరు నాకూ నావారూలేరు
ఏటిగడ్డున యిల్లుగడదంగదరా ॥చల్॥
మారుమల్లితోటలోన మంచినీళ్ళ బావికాడ
వుంగరాలే మరచివచ్చితిగదరా ॥చ॥
చెట్టుదాటి పుట్టదాటి గనమైనవనముదాటి
అన్నిదాటి అడవి పడతిమిగదరా ॥చ॥
కంటికి కాటుకెట్టి కడవా సంకానుబెట్టి
కంటినీరే కడవనిండెనుగదరా ॥చ॥
నీకునాకు జోడువితే మల్లెపూల తెప్పగట్టి
తెప్పమీద తేలిపోదముగదరా ॥చ॥
అంతాపవిత్రమైన ఆగంగజలధిలోన
సరిగంగ లాడుదామగదరా ॥చ॥
బొగడపూలు తెచ్చినీకు చక్కనైన దండగుచ్చి
దండ నీకంఠమునవైతును గదరా ॥చ॥
వంటనీగా నేనువస్తె నాయెన్క నీవువస్తె

## పాట.

### —( రెండవ భాగము. )—

నాకెందుకీకాపురంబు అమ్మ।

నాకుతగినోడుదొరికాడు తాగుబోతు మగడు ॥నా॥

తప్పతాగి నన్ను తన్నేదిగాకుండ తిప్పలెన్నో బెట్టేడమ్మ। బండబూతులెన్నో తిట్టేడమ్మ। వెక్కి వెక్కి దుఃఖపడేదమ్మ। వెర్రిగానవ్వుచుండునో యమ్మ। గడ్డలెల్ల చింపుకొనేడమ్మ। తిండితింటానె కక్కేడునమ్మ। యీపుండకోరుకోను వుండలేనోయమ్మ ॥నా॥

చిల్లిగవ్వకూడ చేతిలోలేదని। యిల్లుబేరమును చేసేడు। వందకైన తాకట్టుబెట్టేడు। కల్లుకొరకును కర్చుపెట్టేడు। దొంగతనమును మొదలుపెట్టేడు। కల్లుచెట్లాపు కన్నమేసేడు। కొట్లుతిట్లునుబడి ఖూనియ్యేడు। దారికాసియు తలలునరికేడు। అమ్మ వద్దె నా కీదొంగవానితోడ జోడు ॥నా॥

పెద్దపులిలాగ అర్ధరేతిరికాడ నిద్దురపోతుంటె చూడె। కోడిపుంజుల వేటానాడెడే। పందిపిల్లల పట్టితెచ్చేడె। మేకలజంపి తీసికొచ్చేడె। గొడ్లనుగోసి పట్టుకొచ్చేడె। ఏమిదొరకకున్న నింకచూడె। ఇల్లుతిప్పాము నన్నుయేకేడె। తల్లి తగనికాపురమాని తాగుడుతెం। చితినేడె ॥నా॥

కల్లుబాగుగతాగి కై పెక్కివచ్చేడు। వచ్చిచెంతకురమ్మ। నేడు। తనిపోట్టితులె నేర్పేడు। తెలియనివూను దెల్పమనేడు। తెల్పకున్నను తిట్టికొట్టేడు। నాకంటెఘనుడు లేడనేడు। జ్ఞానమెంతో నాకున్నాదనేడు। నన్నుగెలచేవాడు లేడనేడు। తల్లి, యిట్టిదాబులుగొట్టు యీలాటినామగడు ॥నా॥

కల్లుబాగాతాగి కాళ్ళునిలబడకేమొ ఇల్లిల్లుగూడతిరిగేడు। చొల్లుమాటలెన్నో పలికేడు। కల్లుగూడవేటా గొప్పజెప్పేడు। చేసిన దొంగపనులెన్నొ జెప్పేడు। జీవులను గోసినదియు జెప్పేడు। యీగొప్పజెప్పెడుగలచెడ్డగుణము నామగడు ॥నా॥

## వడ్డాణం పాట.

వదినా చేయిస్తానన్నాడె మువ్వలవడ్డాణం । వదినా చేయించి పెడ తానన్నాడే రింగులవడ్డాణం ॥ వ ॥

కుచ్చిల్లుఅన్ని పెట్టి ముందర కుచ్చిల్లుఅన్ని పెట్టి । వంగులుబిగువు అవ కుండా సరిగా సరిపోయేటట్లు । నేను పెట్టుకుంటానే వడ్డాణం పెట్టుకుం టానే ॥ వ ॥

తొమ్మిదికాసులు పెట్టి । మాయన్న చేయిస్తానన్నాడు । సరిపోట ట్టుచేయిస్తానన్నాడు । బిగువు అవకుండా చేయిస్తానన్నాడు । రంగు రం గుచీరెమీద బలేబాగుంటాది । బలే సోకుగా యుంటాది ॥ వ

## పా ట.

మధుసూదనా శ్రీరామహరే శౌరీమురారీ మముగావవే ॥మ॥
దేవదేవ జగదీశపరాత్పరా దీనదయాశరధీ మముగావవే ॥మ॥

## పా ట.

అమ్మా బలే బలే వానకొట్టింది । అమ్మా దంచి దంచి బాగాకొట్టింది ॥అమ్మా॥

అమ్మా ఏమనిచెప్పమంటావు । ఆవానకు తడిసినేను । బజారుకు వె ల్తుంటే । నాకోక ఒంటికంటిపోనాది । అంతలో రాడీనునాకొడుకు ఎగా దిగా చూసాడు । ఏమనుకొన్నాడో ఏమితలచుకొన్నాడో । పిల్ల గుడ్డయి ప్పి పిండికట్టుకోరాదా । నీఒళ్ళంత కనబడితె । కంగారు పడతారు ॥గు॥

అమ్మా చెప్పసిగ్గౌతుంది । నాదేంటి నీకుకనపడ్డాదిరా నేను గుడ్డ యిప్పికోను । నన్నేంటి చేస్తావు ॥అమ్మా॥

పిల్లా నీజాకెట్టులో బాడీ కనిపిస్తుంది । నీ మెడలనున్న కోకంచుకని పిస్తుంది । యింకాఅన్నీ కనిపిస్తున్నాయి ॥గు॥

అమ్మా పైకెత్తిపిండికున్నాను । తవ్వాడునీళ్ళువరకు కారినాయి । అ వ్వుడు పాడిపాడిగా తడితడిగా । కట్టుకొచ్చాను నేను ॥అమ్మాబలే॥

### పాట.

దేవరాజయ మహాదేవా ॥దే॥

త్రిశూలాహరణా త్రిపురాంతక గణేశా గిరిరాజావరదా

శంకరా మహాదేవా ॥దే॥

సకలలోకజీవ తతికినీకే శరణమపార కృపాకలా

బాలచంద్రశేఖర పరమేశ నమోనమో ॥దే॥

### పాట.

శ్రీహరనాథా లోకాధార కుసుమహాసనాధ గావుము బ్రోవుము

పాగల్ హరనీ నామమె నమ్మిన పాపముగొలగుదుగా ఆఆఆఆ

॥శ్రీహర॥

దేవదేవ జగాధీశపరాత్పరా కాపాడగమునురావా

లోకరక్షకా నిను నే నమ్మితి మముగనదయరావా దేవా ॥శ్రీహర॥

### పాట.

ఇహపరానంద జీవనా నీకేనా ఆఆఆ ॥ఇ॥

ప్రేమసుధాపారా సరసీనిత్యకావిహారనైతి కామినీమణి నిను పతిగా

బడయగంటినో సుశీలా ॥ఇ॥

### పాట.

భయోత్పాతమేలా పావనా నీపతిని బ్రతికింపలేనా పావనా

జగముకు ప్రభాకరా విధవశూన్యమై బాగులగ నేలాభువనావళికిని

ఆపదవిడగా నానె నీపతిబ్రతికింపనే లేరా ॥పా॥

### పాట.

ఆహా యిదియేమి గంగాదేవికి ప్రియాసా

భువనైకరాజ్యమైన పుణ్యశీలకేలా

యీపాపపు పిశాచమహాతాపము పరమేశా ॥ఆహా॥

నీడచూచి జడుసుకొంటివిని గదరా ॥చ॥
గదరా చెంగల్వపాదలా మధురావెన్నెలరేఖా
నిదురాకు రమ్మనంటిఁగదరా ॥చ॥

## భైరవి.

ఉ. ఆతడ నేఁ యుద్ధముబ వాటియుదేరిన వృద్ధమూర్తి నే
నో! తరుణుండ నక్కతన నుండిన నుండగవచ్చు సుత వి
ద్యాతిశయంబు తాతయెడ నందులకుం బదివేల రెట్లు నీ
యాత్రగదా గదాధర! జయోదయమబ్బుటకింక శంకయే..

## మాయామాళవగౌళ.

శ్లో. యాశ్యత్యద్య శకుంతలేతి హృదయం సంస్పృష్ట ముత్కంఠయా
కంఠ స్తంభిత బాష్పవృత్తి కలుషశ్చింతాజడం దర్శనం
వైక్లబ్యం మమ తావదీదృశ మహో స్నేహాదరణ్యౌకసః
పీడ్యంతే గృహిణః కథన్ను తనయా విశ్లేషదుఃఖైర్నవైః.

## మాయామాళవగౌళ.

ఉ. కొండలమందె డెందము శకుంతల తానిపుడేగునంచయో
కర్రిందుగ బాష్పరోధమున కంఠమునుం జెడె దృష్టిమాంద్యముల్
బొందె యొకింత పెంచిన తపోధనులే యిటుగుంద ఎంతగా
గుందుదురో తమంతగను కూతులబాయు గృహస్థులక్కటా.

## శంకరాభరణం.

ఉ. తమ్ముని బిడ్డలంచు మదిదల్పడు పుత్రులలోనగూడి రా
జ్యమ్మున మీకు పాలొసగడంచనృపాలుడటంచు మొన్న నీ
సమ్ముఖమందె తెల్పెగద సంజయుడా కురురాజు లుబ్ధుని
త్తమ్మున కన్ను గానకిసు తప్పదు యుద్ధము బంధునాశమున్.

## కామిక్.

ఓరోరిబండివాడా । ఒయ్యారిబండివాడా
బండివాడనాసోకు । బండివాడనాశోకు । నిలపరానీబండినీ యో
కోడెనూడలాగునున్న । కోడెగాడ నిల్వుమురా
యీడుజోడునొక్కటిరా । కూడకలసిపోదమురా
సంతలోనిన్నుజూచి । చాలకాలమయ్యెరా
మంత్రములాడుమురా । చింతలన్నిబాయునురా
బండిలోకూచోబెట్టి । బండిచుట్టుతెరనుగట్టి
గండెవారితోటలోకి । బండి పోనీయుమురా
ఆకులతోటనీడక్రింద । అందమైనవచ్చగడ్డి
జోరుగామొలచింది । సోకులన్నితీరునురా
పొద్దుకుంకులోపలనే । ముద్దులాడింపుమురా
మొద్దులాటినామగడు । గుద్దిగుద్దిచంపునురా
ఎవరిమోముచూచితిమో । యిద్దరముకలసినాము
రవికముడివూడిపోయె । రంతుకేలజేతువురా
మీటినావిచ్చుగుబ్బల్ । పాటవమునజూడుమురా
కోటదాటిపోవవురా । గూటిలోకి రావేరా
అబ్బబ్బనాయొడలు । యొబ్బిపోవుచుండెనురా
దిబ్బయెక్కిచూడకురా । మబ్బుచాటునకురారా
నామనసునిల్పలేను । నన్నుముద్దుపెట్టుకొని
ఆమిద్దెపైకినన్ను । హాయిగదోడ్కొనిపోరా

## మధ్యమావతి.

ఉ. చచ్చిరి సోదరుల్సుతులు చచ్చిరి చచ్చిరిరాజులెల్ల రీ
కచ్చెకు మూలకంపమగు కర్ణుడు మామయు జచ్చిరీగతిం
బచ్చని కొంతిమాంతివి బాపురె! కౌరవనాథ నీసగం
బిచ్చెడ జీవితేచ్ఛకలదేని బయల్పడుమయ్య గ్రక్కునన్.

## పాట.

జే జే బంగరు ముద్దులతండ్రీ! జే జే మోహనమూర్తీ ॥జే॥
పాలుగారు నీ చెక్కుల ముద్దిడు భాగ్యము మాకు లభించె ॥జే॥
వినోదమగు నీ వింతపలుకులూ విననోచితిమో సుకుమారా
ఆ జగదీశుని సత్కృపచేతను ఆపదగడచితిమి ఆహాహా ॥జే॥

## పాట.

విశ్వప్రేమయె శుభమూ విశ్వప్రేమయె సుఖమూ ॥వి॥
పెద్దపిన్నయను భేదములేదూ రాజా-వాదములేమా
కమగానుడీ! జయమనుడీ! జననీ ప్రాజకు రండీ ॥వి॥

## పాట.

ర్య—ఓనాధా మీదర్శనభాగ్యము మాకెపుడు గల్గునో ॥ఓ॥
త్రుడు—ఓతండ్రి మీదర్శనభాగ్యము నాకెపుడు గల్గునో ॥ఓ॥
ండ్రి—పుత్రికా శ్రీరామునికృప నాపై నెపుడు కల్గునో యపుడు
జాతునయ్యా ఖేదమొందకు
క్తులు—దేవా మీచరణసేవ యెపుడు కేతుమోకదా
ర్య—ఈవియోగ మెటులోర్తును యేగతియిక నాధా
ర్త—యేకాలమునకు మనకే కష్టములెటు ప్రాప్తమూనో ఆకాలంబున
కాగతు లందరనుభవించవలయు యిదివింత మనమెంత విష్ణుంత
కనుమంత అఖిలభువననాధుడే దశావతారములనుదాల్చి నిఖిలకష్ట
ములనుబొంద
టులు—జీ చెలో చెలో జావ్
క్తులు—దేవ దేవ సార్వభౌమ దివ్యవినుత శ్రీరామ మా రామదాసుమాకు
శీఘ్రమిప్పింపవే వందనమయ్యా మీకు.

### పాట.

తొలగిపోనిండయ్యా దొరలు ఇద్దింటోన్ని తెలిసిసెప్పకుంటె తులువా పొమ్మంటారు ॥తొ॥ పబులుసూకుక్కల కట్టివేస్కొండయ్యా గబగబశావం చు కరువవత్తుండయ్యా ॥తొ॥ వాచనంటారు మూరోచమంటారు నేకాసంత కల్లేస్తె కాటికిపోతుండ ॥తొ॥

### పాట.

ఓహో సరసూడ నిన్నెకోరివచ్చితి నీచేరికాగలింపవేగరారాప్రియా ఏరవన్నె కాడవు మమ్మేలుకొమ్మ వన్నెరేడా ఎంతో శ్రమజెంది ఎంతో భంగమజెంది నిన్నెకోరివచ్చితి నీచేరికాగాలింప వేగరారాప్రియ ॥ఓ॥

### పాట.

ఎచ్చటకీగొని పోయెదు జననినీ బిచ్చపుబాపడవీవు మ్రొచ్చవలెను నీమొగము జెట్టుకోర ముద్దుకు మరిరమ్మనెదూ ॥ఎ॥ ఏమనితలచితో నీమది తులువా శూరుని లోహితుగనవా యీమహీపతి నీకష్టవచ్చినను గోసెద ముక్కలు గాగనె ॥ఎ॥

### కమాచ్ — ఆది.

ధన్యుడనైతిని తాపసచంద్రా మాన్యంబయ్యెను మామకజన్మము ॥ధ॥ పావనమగు మీపాదస్పర్శముచే విమలత్వము జెందెను నాశిరమేగతినోచ్చెనో మీమృదుపాదము వ్రేగగు నాదుకిరీటము తాకున ॥ధ॥

### పాట.

జానకి — సుందరమాలతి ఎందరి మనమిటు కరచి కులికెదవే
రఘు — జానకి మాలతి జీవనశోభే రామమధుపప్రియ పాలేనే
రఘు & జానకి — పూలపరిమళము అందముపోలె
విడశ వెలిగెదమే
వెలసినంజా వెన్నెలవికలూ

ప్రేమసుధలో మధురములుగా
మేనులె విడిగా మనసు లొకటై
గడపివేయుదమే—

జానకి—సుఖజీవనసుధానిధానా నీమోముగనీ మురిసేరా
విను పాడెద మురళీగీత ఊం అను అను వినరా తనయా
రా ఆడుము మధురాకారా
దరహసితవదన సుకుమారా.

పాట.

ఫలమిదియా ప్రేమజపపూజలకూ
మనమున నాటీ కొలుచుచున్నా
ప్రియతమునే కోరతగనా॥
కలకలరితీ చిలుకలుగూయ మధురముగా
సాగరముజేరగ ప్రేమాకృతులై
నదులుపొంగి పరుగులువార
ప్రేమఫలము నే కనదగనా॥
సొగసులరాణి చదువులవాణి సరిపి తుదా
వచ్చినవానీ కలయికలేమీ గిలిగిలివా.

పాట.

బ్రతుకుజగతి కృతియాగా—సతి
తోడిమవిడని విరి
పతినివిడని సతిబ్రతుకు॥
ప్రేమదియోగుల వలపునుబ్రతుకూ
ఆశలతో మునుసాగూ—ప్రే—
రాశలతో మునుసాగూ ।సతిబ్రతుకూ॥

## పాట.

తల్లినిమించే దైవమువేరే ధారుణిలేదోయీ॥
స్వారాజ్యమ్మా స్వరాజ్యమాతృమ సేవాఫలమోయీ
మాతృచరణములపై సాగిలి మ్రొక్కి చూడుమురా
ముదమూ గనరా
ఇహమూ పరమిదియేరా నీకుజీవన్ముక్తిరా
తనువు ధనము తపసంతా మాతా
పూజాబలికీరా.

## పాట.

నీయడుగులే నమ్మినారా నాసామి
నన్నుయిడనాడిపొయ్యేవా॥
చిన్నబాల్లిముందు చేతిలోచెయ్యేసి
వొట్టేసిపెడదారి రుచులకాసించేవ॥
పుచ్చపూవులాటి పున్నమీయెన్నెల్లో
సరసమాడూతుంటె సరులు తెగిపోతేను
జరదాలు మోనిసే సరసకూరాకుంటె
సరిపోయెనని వీపు సరిచింది మరిశావ॥
సీతమ్మజడతెచ్చి చెరివి నాజడలోన
నీతోడె వోపిల్ల నిన్నిడవ నన్నావు ॥నీ॥

బానుముద్రాక్షరశాల, రాజమండ్రి—1939

